# వైశేషికమీమాంసా దర్శనము

( కణాదమహర్షి )

# దీపిక

ఈ దర్శనమును వైశేషిక దర్శనమనియు, కణాద దర్శనమనియు చెప్పుదురు. కణాదఋషిచే రచింపబడుటవలన దీనిని కణాద దర్శనమని యందురు. ఈ దర్శనకర్త ఋషిపావురమువలె ఒక్కొక్క గింజనే ఏరుకొని ప్రతిరోజు తన జీవితమును గడపువాడగుటవలన (కణములను ఏరి తినువాడగుటవలన) కణాదుడనబడెను. ఇతని వృత్తిని కాపోత వృత్తి యందురు. ఇతనిని కణభక్షుడనియు అందురు. ఇతడు కశ్యపగోత్రుడు. ఉలూక మహర్షి కొడుకు. కాన ఔలూక్యుడని యింకొక పేరుగలదు. కాన దీనిని ఔలూక్య దర్శనమనియు అందురు. ప్రమాణాదులైన పదునారు పదార్థములను గౌతముడు న్యాయదర్శనములో అంగీకరించెను. అవియు నితనికి సమ్మతములే. కాని ఈ లోకమున నున్న పదార్థములలో ధర్మములేవి? కాని ధర్మము లెన్ని విధములు? అని పరస్పరము సంసర్గము కాకుండ పదార్థజ్ఞాన మెంతవరకు కలగదో యంతవరకు సాధర్మ్య జ్ఞానము తెలియదు కాన సాహచర్య నియమ రూపమైన వ్యాప్తి జ్ఞానము సులభము కాదు. అందుచే ద్రవ్యగుణ భేదము చేత పదార్థములు ఏడే యని నిశ్చయించి ఈ ద్రవ్యమున కిది స్వరూపము ఇవే దానిగుణములు అనియు సువ్యవస్థితముగా కణాదుడు ప్రతిపాదించెను. కనుక ఈదృశ విశేషమును బట్టి ప్రవర్తించుటవల్ల దీనికి వైశేషిక దర్శనమనియు పేరు కలిగినది

## పరమాణు వాదము

అనంత విశేష గుణములు గల యణువులు బ్రహ్మాండ సృష్టికి కారణములని చెప్పుట వలనను దీనికి వైశేషిక దర్శనమని పేరు వచ్చినదనియు కొందరందురు. కారణ గుణములే కార్యమగు సృష్టియందుఁ గనిపించును.

దీనిలో ప్రత్యక్షము అనుమానము అని రెండే ప్రమాణములు అని శ్రీధరనుతానుయాయులు. శబ్దముతో కలిసి మూడని వ్యోమ

మొ శివాచార్యులు. ఇతర ప్రమాణములు అనుమానములో అంతర్భవించును. అనుపలబ్ధి ప్రత్యక్షమున అంతర్భవించును.

మననము అనుమానమున కధీనమైనది. అనుమానము వ్యాప్తికి అధీనమైనది. అగ్నిధూమాది సాహచర్యనియమము వ్యాప్తి. వ్యాప్తి జ్ఞానము పదార్థ వివేకము నపేక్షించి కలుగును. ఇటు ఆరుపదార్థములు కణాదుడీ దర్శనములో వ్యవస్థాపన చేసెను. ఇందు పదార్థజ్ఞానము అభ్యుదయ మార్గములు చూపబడెను.

ఈవైశేషిక దర్శన విశిష్టతను తెలుపుచు సర్వదర్శన సంగ్రహములో ఇట్లు చెప్పబడినది:

"ద్విత్వేచపాకజోత్పత్తౌ విభాగేచవిభాగజే
యస్యనస్ఖలితాబుద్ధిస్తం వైశేషికంవిదుః"

"ద్విత్వసంఖ్యావిషయములోను పాకజముల ఉత్పత్తి విషయములోను ఎవనిబుద్ధి తొట్రుపాటు పడదో వానిని వైశేషికునిగా జెప్పుదురు." అని. ఇది యాభాణకము.

## ద్విత్వవిషయమున వైశేషిక మతము.

ఈవిషయములో మీమాంసకులు ఇట్లనిరి. ఎప్పుడైతే ఘటాదిద్వయము ఒకచోట పరస్పరము కలిసియుండునో అప్పుడే అక్కడ ద్విత్వసంఖ్య పుట్టును. పిదప ఇంద్రియసంనికర్ష తరువాత ఇది యొకటి యొకటి అని యపేక్షింపబడగా ద్విత్వము పుట్టును. కనుక అపేక్షాబుద్ధి ద్విత్వమును వ్యక్తముచేయును గాని పుట్టింపదు. ఎప్పుడైతే ఘటాది ద్వయము విడిపోవునో అపుడు ద్విత్వసంఖ్య నశించును. ఇట్లే త్రిత్వాది విషయములోను అని యందురు. వైశేషికులైతే అజ్ఞాతమైన ద్విత్వసంఖ్యను అంగీకరించుట నిరర్థకమని తలంచుచు అపేక్షాబుద్ధియె ద్విత్వాదులను కలిగించునందురు. వీరి మతములో ఇంద్రియార్థ సన్నికర్షము మొదట సంస్కారము కలుగువఱకు ఎనిమిది క్షణములలో క్రమముగా నిట్లు కలుగునందురు. మొదటి క్షణములో ఇంద్రియమునకు ఘటద్వయ

ముతో సంబంధము. రెండవక్షణములో ఏకత్వ జాతిజ్ఞానము. మూడవ క్షణములో ఈఘటము ఒకటి ఈఘటము ఒకటిఅని యపేక్షాబుద్ధి. నాలుగవ క్షణములో దిత్వసంఖ్యాబుద్ధి కలుగును. అయిదవ క్షణములో ద్విత్వ జాతిజ్ఞానము. ఆరవక్షణములో ద్విత్వసంజ్ఞానము. ఏడవ క్షణములో ఇవి రెండు ఘటములు మొదలైన ద్విత్వ సంఖ్యతోఁ గూడిన ద్రవ్యజ్ఞానము. ఎనిమిదవక్షణములో అటువంటి జ్ఞానమును గలిగించు సంస్కారము ఆత్మయందుఁ గలుగును. ఇట అపేక్షాబుద్ధియే ద్విత్వాదులను పుట్టించును. వ్యంగ్యార్థము దానిని వ్యక్తపరచు వ్యంజకమును అపేక్షించునట్లు ఉత్పాదింపఁబడిన యర్థము ఉత్పాదించుదానిని అపేక్షించును. ప్రస్తుతములో ద్విత్వాదిసంఖ్యను అపేక్షాబుద్ధి అపేక్షించును. అపేక్షాబుద్ధి ద్విత్వాదులను వ్యక్తపఱచదు. ప్రమాణమువల్ల ప్రమేయము సిద్ధించుచుకనుక అపేక్షాబుద్ధికి ముందు ద్విత్వాదికములేదు. ఎక్కడనైతే వ్యంజకము లేకుండ అపేక్షమాణము ఉండునో అక్కడ ఉత్పాదకత్వముండును. ఎట్లనగా శబ్దములు కంఠాది స్థానములను అపేక్షించుచుండఁగా వాయుసంయోగమున శబ్దములు ఉత్పన్నములు అనువ్యాప్తిఁబట్టి అపేక్షాబుద్ధియె ద్విత్వాదులను పుట్టించునని సిద్ధించినది. ఇదియొకటి ఇదియొకటి ఇదియొకటి అని ఏకత్వవిషయకమైన యనిత్యమైన యపేక్షాబుద్ధివల్ల దిత్వాదికము వ్యంగ్యముగాదు. ఏలయన ద్విత్వమన్నది. అనేకమును ఆశ్రయించిన గుణములుగలది. ద్విత్వసంఖ్య రెండిటియందు పర్యాప్తమైయున్నది ఇట్లే త్రిత్వాది సంఖ్యఎట్లన, "చైత్రమైత్రులు దేవదత్తునికంటె వేరైనవారు" అనుచోట పృథక్త్వము అనేకమునందున్నది. దేవదత్తునికంటె చైత్రుడు లేడు. దేవదత్తునికంటె మైత్రుఁడు లేడు అనెడి నానైక్త్వ పృథక్త్వ విషయ కాపేక్షబుద్ధి వ్యంగ్యము కాదు. అన్నదానివలె. కనుక వ్యంగ్యత్వము సిద్ధింపక పోవుటవల్ల ఇంక చివరకు జన్యత్వమే సిద్ధించుచున్నది.

ఇంక నివృత్తి క్రమమెట్లనగా- పైని చెప్పిన యెనిమిది క్షణములలో మూడవక్షణమందు పుట్టిన అపేక్షాబుద్ధి నాల్గవ క్షణములో ద్విత్వ

మొ:

సంఖ్యను పుట్టించుచున్నది. రెండవక్షణములో ఉత్పన్నమైన యేకత్వ జాతి జ్ఞానమును నశింపఁజేయుచున్నది. ఇట్లు ముందు ముందు జ్ఞానములను పుట్టించుచు వెనుకటి వెనుకటి జ్ఞానములను నశింపఁజేయును. అపుడవి నివర్తించునని భావము. ఇది ద్విత్వవిషయములోని వైశేషికమతము.

## పాకజోత్పత్తి విషయము

(పీలు పాకవాదము పిఠర వాదము)

ద్రవ్యములలో తేజస్సంయోగముచేత కొన్నిచోట్ల రూపరసాదికము పరివర్తనము చెందును అపుడు కారణములగు పరమాణువుల గుణములు కార్యములందుఁగలుగును. నల్లని ఘటము కాల్చినపుడు తేజస్సంయోగముచేత ఎఱ్ఱనిదగును. పచ్చని మామిడి అరటికంగు తేజస్సంయోగముచేత పసుపగును. ఇట్లే పండ్లజాతులలోగూడ పులుపువి మధురములగును. తేజస్సంయోగముచే కుండలోని కపాలములు విడిపోవుటచేతగాని వినాశముచేఁగాని ఘటమును వానిభాగములు త్ర్యణుకము వఱకు నశించును. పరమాణువులు నిత్యముగాన ద్వ్యణుకమునకు అవయవనాశముచేత నాశనముకలుగదు. కేవలము పరమాణువులు విడిపోవును. అవి విడిపోయినపుడు పరమాణువులందు పూర్వమందలి రూపరసాదులు నశించి విభాగమొంది అన్యరూపరసాదులు పుట్టి సంయోగమొంది ద్వ్యణుకత్ర్యణుకాదిక్రమముగా క్రొత్తకుండతయారగును. ఇదిసూక్ష్మముగాన కండ్లకుఁగనిపింపదు. ఇది యణుపరిపాక ప్రక్రియ. పరమాణువులను పీలువులందురు. కనుక దీనిని పీలు పాకవాదమందురు. ఇది వైశేషికుల మతము. నైయాయికులు పిఠర పాకవాదము నంగీకరింతురు. పిఠరమనఁగా ఘటాదికమైన యవయవి. తేజస్సంయోగముచేత అవయవములతోపాటు అవయవిలో నొకసారే పూర్వరూపాదులు నశించుట క్రొత్తరూపాదులు పుట్టును అని నైయాయికులందురు. దీనిని పిఠరపాకవాదమందురు."

సున్నపురాయి పగడము ముత్యము వజ్రము రత్నము బంగారము మొదలగువానిలో కారణములగు పరమాణువులలో అనేక విశేష గుణములునుండుటవలనను ఆతేజస్సంయోగాది విశేషములవలనను పైకి భిన్నభిన్న సమయములలో విశేషరూపాదులు కనిపించుచున్నను అవి కారణములగు పరమాణుగుణములే కాని వేఱు కావు అని గ్రహింపవలెను. సూక్ష్మస్థూలపరిమాణ కార్యములనుబట్టి యాయా పరిమాణువుల మూల గుణములను ఊహింపవలయునే కాని అవి ఇంద్రియ గోచరములు కావు.

## — విభాగజ విభాగము —

రెండు వస్తువులు కలియుట సంయోగము. ఆరెండును విడిపోవుట విభాగము, కలియుటకు విరుద్ధమైనది విభాగము. విడిపోవుటకు విరుద్ధమైనది సంయోగము. సంయోగము కర్మజము అని సంయోగజము అని రెండు విధములు. అందులో కర్మజము ఏకతర కర్మజము, ఉభయకర్మజము అని రెండువిధములు. పక్షి చెట్టుమీద వ్రాలినపుడు పక్షికి చెట్టుకు సంయోగము కలుగును. ఒక పక్షియందే కర్మ యుండుటవలన ఏకతరకర్మజము అనంబడును. ఇద్దఱు మల్లురు పోరాడునపుడు ఆమల్లునియందు ఈమల్లునియందు పోరాటమనుకర్మ యున్నది కాన ఉభయకర్మజము అందురు. పక్షి చెట్టుమీద పడినపుడు పక్షికి ఆకొమ్మకు గలిగిన సంయోగమునుబట్టి ఇతరమగు కొమ్మలకు గలుగు కంపము పక్షి శాఖా సంయోగము నుండి ఇతరశాఖాదులకు సంయోగము కలుగుచున్నదికాన ఇది సంయోగజ సంయోగము అనంబడును. ఇట్లే విభాగములోఁగూడ కర్మజమని విభాగజమని రెండు విధములై మరల కర్మజము ఏకతరకర్మజము అని ఉభయకర్మజమని యగును. పక్షి చెట్టునుండి ఎగురునప్పుడు పక్షికి చెట్టుకు విభాగము ఏర్పడును. అప్పుడు పక్షియందే కర్మ ఉండును. మల్లురు పోరాడి విడిపోవునపుడు ఇద్దఱు విడిపోవుదురు గాన ఇద్దరిలో విభాగకర్మ యుండును. ఇది

యుభయకర్మజము. పక్షి చెట్టునుండి యెగురునపుడు ఆ విభాగమువల్ల అదరి ఆ కొమ్మయందలి పువ్వులో పండ్లో రాలి విభాగ మేర్పడును. అది విభాగజము. ఇవేకాక ఇంకను కారణమాత్ర విభాగజము కారణా కారణ విభాగజము అని విభాగజ విభాగము రెండు విధములుగా నుండును. ఈవిశేషము వైశేషికులు చెప్పినది. రెండు వస్తువులు సంయోగము చెందినపుడు ఆరెండిటికి మధ్య ఆకాశముకలదు. విభాగములో ఆరెండిటికి మధ్య నున్న ఆకాశమునుండి విభాగము ఆక్షణమందే కలుగదు. ఆకాశములో విభాగము కలిగెడి క్షణము వేఱు అని వీరందురు. విడిపోవునపుడు సంయోగము నశించి యవయవి నశించును. మొదట అవయవితో కలియునపుడు ఆకాశమునుండి విభాగము కలుగును. కావున దీనిని కారణమాత్ర విభాగజమందురు. శరీరము నుండి చేయి తీసినపుడు చేతియందున్న విభాగకర్మ పుట్టి యితర శరీరమందు విభాగము కలిగించుచు అచటి ఆకాశము నుండి విభాగమును కారణములేకయె కలిగించును గాన కారణము నుండి కారణముకాని దాని నుండి విభాగము కలుగునుకాన కారణాకారణ విభాగజ విభాగ మన బడును. వివరము ఇతరమగుచోట్ల గ్రహింపనగును.

ఇట్లు ఈ విశేషములను ఈ పదార్థములను తెలిసికొని వాని మననము ద్వారా వేదములను పరమేశ్వరుని మోక్షమును తెలిసికొని మనము అభ్యుదయమును పొందుదుముగాక.

ఇట్లు
బుధవిధేయుడు
చర్ల గణపతిశాస్త్రి.

# విషయ సూచిక

వెం



---

# వైశేషిక మీమాంసా దర్శనము

## ౧వ అధ్యాయము. ౧వ ఆహ్నికము.

మూ. అథాతో ధర్మంవ్యాఖ్యాస్యామః 1-1-1

సూ. మఱియింక ధర్మమును వ్యాఖ్యానము చేయుదుము.

మూ. యతోఽభ్యుదయ నిశ్శ్రేయససిద్ధిః స ధర్మః 1-1-2

సూ. అభ్యుదయమును మోక్షమును సిద్ధింపఁజేయునది ధర్మము.

మూ. తద్వచనాత్ ఆమ్నాయస్య ప్రామాణ్యం 1-1-3

సూ. ఆ ధర్మమును చెప్పుటవల్ల వేదము ప్రమాణము.

మూ. ధర్మవిశేషప్రసూతాత్, ద్రవ్యగుణ కర్మసామాన్య విశేషసమవాయానాం పదార్థానాం సాధర్మ్యవై ధర్మ్యాభ్యాం తత్త్వ జ్ఞానాత్ నిఃశ్రేయసం 1-1-4

సూ. ధర్మవిశేషముచేఁ గలిగినదియు, ద్రవ్యములు గుణములు కర్మలు సామాన్యము విశేషము సమవాయము అను పదార్థముల సాధర్మ్య వైధర్మ్యములవల్ల కలిగినదియు అయిన తత్త్వజ్ఞానమువల్ల మోక్షము కలుగును. అభావముఅనునదికూడ వేరే పదార్థము గలదు.

వివ:- సాధర్మ్యము = ఎప్పుడును ఉండు సమాన ధర్మము. వైధర్మ్యము = ఎప్పుడునులేని ధర్మము. భూమి ద్రవ్యములు మొదలగు నవి తర్వాత సూత్రములలో వివరింపఁబడును.

మూ. పృథివ్యాపస్తేజో వాయురాకాశం కాలో దిగాత్మా మన ఇతిద్రవ్యాణి. 1-1-5

సూ. భూమి నీరు తేజస్సు గాలి యాకాశము కాలము దిక్కు ఆత్మ మనస్సు అని ద్రవ్యములు తొమ్మిది.

వివ:- తేజస్సు లేనప్పుడు చీకటి యుండును. కాన చీకటి వేరే పదార్థము కాదు.

మూ. రూప రస గంధ స్పర్శాః సంఖ్యాః పరిమాణాని పృథక్త్వం సంయోగ విభాగౌ పరత్వా పరత్వే బుద్ధయః సుఖ దుఃఖే ఇచ్ఛా ద్వేషౌ ప్రయత్నాశ్చ గుణాః 1-1-6

సూ. రూపము రసము గంధము స్పర్శ సంఖ్యలు పరిమాణము పృథక్త్వము సంయోగము విభాగము పరత్వము అపరత్వము బుద్ధి సుఖము దుఃఖము ఇచ్ఛ ద్వేషము ప్రయత్నమును అనునవి గుణములు.

వివ:- ప్రయత్నమును అను సముచ్చయముచే గురుత్వము ద్రవత్వము స్నేహము సంస్కారము ధర్మము అధర్మము శబ్దము అను వానిని గూడ గుణములుగా గ్రహింపవలెను. రూపము, నీలము తెలుపు ఎఱుపు పీతము కపిశము చిత్రము అని ఆఱు విధములు. రసము, మధురము ఆమ్లము లవణము కారము వగరు చేదు అని ఆఱు రకములు. గంధము సురభి అసురభి అని రెండు విధములు. స్పర్శ. ఉష్ణము శీతము అనుష్ణాశీతము అని మూడు విధములు. సంఖ్యలు ఒకటినుండి అర్బుదము వఱకు సంఖ్యలు.

మూ. ఉత్క్షేపణ మపక్షేపణ మాకుంచనం ప్రసారణం గమనమితి కర్మాణి 1-1-7

సూ. పైకి విసుర్మట క్రింద పడవేయుట దగ్గరకు లాగుట చాపుట కదలుట అని కర్మలైదు.

వివ:- కదలుట అనుదానినిబట్టి భ్రమణ రేచన స్పందనాదులు గ్రహింపదగును.

మూ. సత్ అనిత్యం ద్రవ్యవత్ కార్యం కారణం సామాన్య విశేషవదతి ద్రవ్యగుణ కర్మణా మవిశేషః 1-1-8

సూ. సత్త అనిత్యము ద్రవ్యవంతము కార్యము కారణము సామాన్యవంతము విశేషవంతము అనునవి ద్రవ్యగుణ కర్మలకు సమాన ధర్మములు.

మూ. ద్రవ్యగుణయోః సజాతీయారంభకత్వంసాధర్మ్యః 1-1-9

సూ. సజాతీయములగు పదార్థములను జనింపజేయుట ద్రవ్య గుణములకు సమాన ధర్మము.

మూ. ద్రవ్యాణి ద్రవ్యాంతర మారభంతే గుణాశ్చ గుణాంతరం 1-1-10

సూ. ద్రివ్యములు ఇతర ద్రివ్యములను గుణములు ఇతర గుణ ములను గలిగించును.

సమాన ధర్మము — సాధర్మ్యము.

వివ:- భూమ్యాది పరమాణువులవలన ద్వ్యణుకాది మహా భూ మ్యాదులు భూమ్యాదులందున్న గంధత్వ శీతత్వోష్ణత్వాదుల పరమా ణువులవలన ద్వ్యణుకాదులు గలిగి యని వ్యక్తమగును. ద్రివ్యాదులు మూడిటికి సత్తా సంబంధము సామాన్య విశేషవత్త్వము స్వసమవా యత్వము అర్థశబ్దాభిధేయత్వము ధర్మాధర్మకర్తృత్వము సమాన ధర్మ ములు. కారణయుతములకు కార్యత్వానిత్యత్వములు, అనిత్యద్రివ్యము లకు ద్రివ్యాశ్రితత్వము, సామాన్యాదులు మూడిటికి స్వాత్మవత్త్వము బుద్ధి ళక్షణత్వము అకార్యత్వము అకారణత్వము అసామాన్య విశేష వత్త్వము నిత్యత్వము అర్థశబ్దానభిధేయత్వము సామాన్య ధర్మములు. తొమ్మిది ద్రివ్యములకు ద్రివ్యత్వము స్వారంభకత్వము సమవాయి కారణత్వము గుణవత్త్వము కార్యకారణావిరోధిత్వము అంత్య విశేష వత్త్వమును సామాన్య ధర్మములు. భూమి జలవహ్ని వాయ్వాత్మ మనస్సులకు అనేకత్వాపరజాతి మత్త్వములు క్షితి జలజ్యోతి రనిల మనస్సులకు క్రియావత్త్వ మూర్తత్వ పరత్వాపరత్వ వేగవత్త్వములు. ఆకాశకాలదిగాత్మలకు సర్వగతత్వ పరమ మహత్త్వ సర్వ సంయోగి సమాన దేశత్వములు. భూమ్యాదిపంచకమునకు భూతత్వేంద్రియ ప్రకృతిత్వ బాహ్యైకైకేంద్రియగ్రాహ్య విశేష గుణవత్త్వములు.

భూమి జల తేజో వాయువులకు ద్రవ్యారంభకత్వ స్పర్శవత్త్వములు. భూమి జల తేజస్సులకు ప్రత్యక్షత్వ రూపవత్త్వ ద్రవత్వ వత్త్వములు. భూమి జలములకు గురుత్వ రసవత్త్వములు. పృథివ్యాధులకు వైశేషిక గుణవత్త్వము. భూమి జలాత్మలకు చతుర్దశ గుణవత్త్వము. ఆకాశాత్మలకు క్షణికైక దేశ వృత్తి విశేష గుణవత్త్వములు. దిక్కాలములకు పంచ గుణవత్త్వము. సర్వోత్పత్తిమంతములకు నిమిత్తకారణత్వమును క్షితి తేజస్సులకు నైమిత్తికద్రవత్వ యోగము సమాన ధర్మములు.

విరుద్ధధర్మములు — వైధర్మ్యములు.

జలాదులకు నిర్గంధత్వము. జల భూమి భిన్నములకు గురుత్వ రసవత్త్వములు విరుద్ధ ధర్మములు. తేజఃప్రభృతులకు గురుత్వ రసవత్త్వములు. ఆత్మకు పరార్థత్వము అచేతనత్వము మనస్సునకు అనంతఃకరణత్వము అనష్టగుణవత్త్వము. జలేతరములకు స్నేహత్వము అక్లేదత్వము. జలజ్యోతిరనిలములకు అపాకజస్పర్శత్వములు. దిక్కాల మనస్సులకు వైశేషిక గుణరహితత్వము. వాయ్వాకాశ దిక్కాల మనస్సులకు అతీంద్రియత్వము. ఆత్మ మనస్సులకు శరీరాంతర్గతత్వము వృత్తి లాభము. వాయ్వాదులకు స్పర్శశూన్యత్వము. ఆకాశాదులకు స్పర్శత్వము. కాలాదులకు అభూతత్వము విరుద్ధ ధర్మములు.

మూ. కర్మ కర్మసాధ్యం నవిద్యతే. 1-1-11

సూ. కర్మచే సాధింపఁదగిన కర్మ లేదు.

కర్మ యింకొక సజాతీయ కర్మను పుట్టింపదని భావము, సంయోగ విభాగములచేఁ గర్మ కలుగును. కర్మయె కర్మను పుట్టించునన్నచో సంయోగ విభాగములు లేకయె కర్మకు పూర్వము ఇంకొక కర్మ యుండవలసివచ్చును. అట్లు లేదు గాన కర్మవలన ఇంకొక కర్మ కలుగదని భావము.

మూ. న ద్రవ్యం కార్యం కారణంచ వధతి 1-1-12

సూ. ద్రవ్యము తన కార్యమునుగాని కారణమునుగాని నశింపఁ జేయదు.

ప్రతి ద్రవ్యము కారణముగానో కార్యముగానో యుండును కాన అవి యొకదానినొకటి నశింపఁజేయవు. వానికందు సంయోగ నాశములవల్లనే నశించునని తెలియునది. కారణములగు బంగారము మట్టి మొదలగునవి కడియములు కుండలు మొదలగు కార్యములుగా నగును. కడియములు కుండలు మొదలగునవి మొదట బంగారము మట్టి మొదలగు కారణములరూపముగా నుండును.

మూ. ఉభయథా గుణాః 1-1-13

సూ. గుణములు కార్య కారణములను రెండింటిని నశింపఁ జేయును.

శబ్దము రూపము మొదలగు గుణములు మొదట తనకు కారణముగా నున్న శబ్దాదులను నశింపజేసి బయలుదేఱును. ఆ బయలుదేఱిన శబ్దాదులు తరువాతి శబ్దాదులవల్ల నశించును. కాన గుణములు కార్య కారణములను నశింపఁజేయుచు కార్య కారణములు రెండుగా నుండును.

మూ. కార్య విరోధి కర్మ 1-1-14

సూ. కర్మ కార్యమె విరోధిగాఁ గలది.

కర్మ తానొక కార్యమును పుట్టించి నశించునని భావము. కార్యము సిద్ధించువఱకు మాత్రము కర్మ ఉండి తరువాత నశించును. కార్యమగు వస్త్రము తయారుకాఁగానే నేయుట అను కర్మ పోవును. కాన ఇట్లు చెప్పబడెను.

మూ. క్రియా గుణవ త్సమవాయి కారణమితి ద్రవ్యలక్షణం 1-1-15

సూ. క్రియా గుణములుగల సమవాయి కారణము ద్రవ్యము.

ఉపాదానకారణము సమవాయికారణముగ నుండును. ఏది లేక పోయినచో ఏకార్యముకాదో అది యుపాదానకారణము. కుండకు మట్టి, వస్త్రమునకు నూలు ఉపాదానకారణము.

మూ. ద్రవ్యాశ్రయీ అగుణవాన్ సంయోగ విభాగేష్వకారణ మనపేక్ష ఇతి గుణలక్షణం. 1–1–16

సూ. ద్రవ్యమును ఆశ్రయించినదై, మఱియొక గుణములేనిదై సంయోగ విభాగములందు ఆక్షేపింపఁబడనిదై కారణముకంటె వేఱయి యుండునది గుణము.

మూ. ఏకద్రవ్య మగుణం సంయోగ విభాగే ష్వనపేక్ష కారణ మితి కర్మలక్షణము. 1–7–17

సూ. ద్రవ్యమును మాత్రము ఆశ్రయించినదై గుణములులేనిదై సంయోగ విభాగములందు ఇతరాపేక్షలేక కారణమై యుండునది కర్మ.

మూ. ద్రవ్యగుణ కర్మణాం ద్రవ్యం కారణం సామాన్యం. 1–1–18

సూ. ద్రవ్యగుణ కర్మలకు ద్రవ్యము సమాన కారణము.

ద్రవ్యమువలననె ద్రవ్య గుణకర్మలు జనించునని భావము. మట్టివలన కుండయు దానితోపాటు గంధము, జడత్వమును సంకోచమగుట కలుగును. ఇట్లే ఇతర ద్రవ్యములందు గ్రహించునది.

మూ. తథా గుణః 1–1–19

సూ. అట్లే ద్రవ్యగుణ కర్మలకు గుణము సమానకారణము.

మూ. సంయోగ విభాగ వేగానాం కర్మ సమానం. 1–1–20

సూ. సంయోగ విభాగ వేగములకు కర్మ కారణమగుట సమానము.

మూ. న ద్రవ్యాణాం కర్మ. 1–1–21

సూ. ద్రవ్యములకుఁ గర్మ కారణము కాదు.

ద్రవ్యములు ద్రవ్యములవల్లఁ గాని గుణములవల్లఁగాని ఉత్పన్న మగునుగాని కర్మవల్ల ఉత్పన్నముగావు. కర్మవలన సంయోగము పుట్టి పిదప ద్రవ్యము ఉత్పన్నమగునని భావము.

మూ. వ్యతిరేకాత్ =1-1-22. (నశించుటవలన)

సూ. కర్మ తాను పుట్టిన మరునిముషమందె నశించుట వలనఁ గర్మ ద్రవ్యములకుఁ గారణము కాదు.

మూ. ద్రవ్యాణాం ద్రవ్యం కార్యం సామాన్యం. 1-1-23

సూ. అనేక ద్రవ్యముల వలన ఒక ద్రవ్యమె కలుగును.

అనేకములైన దారములవల్ల బట్ట యొకటి యగుట యిందుకు ఉదాహరణము.

మూ. గుణ వైధర్మ్యాత్ నకర్మణాం కర్మ. 1-1-24

సూ. గుణములతో సమానధర్మము లేకపోవుట వలన అనేక కర్మలవల్లఁ గర్మ కలుగదు.

గుణములు గుణములను పుట్టించునట్లు కర్మలు కర్మలను పుట్టింపవు. కర్మచే సాధింపదగిన కర్మ లేదు (11 సూ.) అను దాని భావమె యిందు మరల చెప్పబడినది.

మూ. ద్విత్వప్రభృతయః సంఖ్యాః పృథక్త్వ సంయోగ విభాగాశ్చ. 1-1-25

సూ. రెండు మొదలగు సంఖ్యలును పృథక్త్వ (వేఱయి యుండుట) సంయోగ విభాగములును అనేక ద్రవ్యములచే నారంభింపఁబడిన కార్యములు.

మూ. అసమవాయాత్ సామాన్య కార్యం కర్మ నవిద్యతే. 1-1-26

సూ. రెండు ద్రవ్యములందుఁ గాని రెండిటికంటె నెక్కుడైన ద్రవ్యములందుఁ గాని కలిసి యుండక పోవుటవలన సముదాయ రూపముగఁ గర్మ కనుపట్టదు. సంయోగ విభాగ విశేషములందుఁ గర్మ

కనుపించునదే కాని వేఱుగా ద్రవ్యములందుఁ గాని ద్రవ్యములకు వేఱుగాఁ గాని కనిపించునది కాదని భావము.

మూ. సంయోగానాం ద్రవ్యం. 1-1-27

సూ. అనేక సంయోగములకు ద్రవ్యము కార్య మగును.

మూ. రూపాణాం రూపం. 1-1-28

సూ. అనేక రూపములకు రూపము కార్య మగును.

మూ. గురుత్వ ప్రయత్న సంయోగానాం ఉత్క్షేపణం. 1-1-29

సూ. గురుత్వ ప్రయత్న సంయోగములకు ఉత్క్షేపణ (పైకెత్తుటయె) కర్మయె కార్యము.

ఇట్లు అవక్షేపణము (=దింపుట) మొదలగు వానియందును.

మూ. సంయోగ విభాగ వేగాశ్చ కర్మణాం. 1-1-30

సూ. సంయోగ విభాగ వేగములు కర్మల కార్యములె,

మూ. కారణ సామాన్యే ద్రవ్యకర్మణాం కర్మ అకారణ ముక్తం. 1-1-31

సూ. కారణ సామాన్యమును గుఱించి చెప్పఁబడిన సందర్భములో ద్రవ్యకర్మలను గుఱించి మాత్రము చెప్పబడినది.

ఇందుచే ద్రవ్య కర్మలకుఁ గర్మ కారణము కాదు. కాని సంయోగ విభాగములకుఁ గర్మ కారణమగుట విరుద్ధముకాదని భావము.

ఇది

కణాద మహర్షిచే రచింపఁబడి చర్ల వెంకమాంబా

నారాయణ శాస్త్రిల తనయుఁడగు

చర్ల గణపతిశాస్త్రిచేఁ దెనిఁగింపఁ బడిన

వైశేషిక మీమాంసా దర్శనమున

మొదటి యధ్యాయములో

మొదటి యాహ్నికము.

---

## మొదటి యధ్యాయమున రెండవ అహ్నికము.

మూ. కారణాభావాత్ కార్యాభావః. 1-2-1

సూ. కారణము లేకుండఁ గార్యము కలుగదు.

కారణములగు మట్టి చక్రము నీరు కఱ్ఱ మొదలగు వానిలో ఏది లేకున్నను కుండ తయారు కాదు. ఇట్లే ఆశ లేకున్నచో పుట్టుకయు పుట్టుక లేకున్న రోగము ముసలితనము దుఃఖములుగాని కలుగవని భావము.

మూ. న తు కార్యాభావాత్ కారణాభావః. 1-2-2

సూ. కార్యము లేనిచో మాత్రము కారణ ముండకపోదు.

కార్యము లేకపోయినను కారణముండునని భావము. కార్యమైన కుండ లేకపోయినను కారణమైన మట్టి యుండునని భావము.

మూ. సామాన్యం విశేషణం బుద్ధ్యపేక్షం. 1-2-3

సూ. సామాన్యము విశేషము అనునవి బుద్ధి నపేక్షించి సాపేక్షకములై యుండును.

ప్రాణులు అనునది సామాన్య వాచకము. ప్రాణులలో మనుష్యులు శ్రేష్ఠులు అనుచోట మనుష్యులు అనునది విశేష వాచకము. మనుష్యులలో కొంతమంది బుద్ధిమంతులు అనుచో మనుష్యులు అన్నది బుద్ధిమంతులు అనుదానిని బట్టి సామాన్యము. కనుక నివి బుద్ధిని అపేక్షించి యుండునవి యని భావము.

మూ. భావోఽనువృత్తేరేవ హేతుత్వాత్ సామాన్యమేవ 1-2-4

సూ. ఉనికి అనునది అనాది నుండి వచ్చు వస్తువునకే హేతువై యుండుటవల్ల అది సామాన్యమె అగును.

సకల వస్తువులు ఉండునవిగాన వానికి ఉనికి అన్నది సామాన్య గుణమై యుండునని భావము.

మూ. ద్రవ్యత్వం గుణత్వం కర్మత్వాంచ సామాన్యాని విశేషాశ్చ. 1-2-5

సూ. ద్రవ్యత్వ గుణత్వ కర్మత్వములు సామాన్యములు విశేషములు కూడ నగును.

పృథివీ జలాదులందున్న ద్రవ్యత్వాదులు సామాన్యములు. రూపరసాదులందున్న గుణత్వాదులు సామాన్యములు. కుండ, ఎఱ్ఱని, కూర్చుండుట మొదలగు వానిలో నున్న ద్రవ్యత్వాదులు విశేషములు.

మూ. అన్యత్రాన్త్యేభ్యో విశేషేభ్యః. 1-2-6

సూ. పదార్థములను విభజింపఁగా విభజింపఁగా వచ్చిన చివరి పరమాణు విశేషములుగాక మిగిలిన ద్వ్యణుకాదులకే సామాన్యములు విశేషములు అను పేర్లు చెల్లును. ద్వ్యణుకాది కార్యములకే గాని నిరవయములకీ సామాన్య విశేషనామములు చెల్లవని భావము.

మూ. సదితి యతో ద్రవ్యగుణకర్మసు సా సత్తా. 1-2-7

సూ. దేనివలన ద్రవ్య గుణకర్మలందు ఇది సత్పదార్థము అని వ్యవహారములు కలుగునో అది సత్త (ఉనికి) అనఁబడును.

మూ. ద్రవ్యగుణ కర్మభ్యోఽర్థాంతరం సత్తా. 1-2-8

సూ. ద్రవ్యగుణ కర్మలకంటె సత్త అన్నది వేఱు.

ద్రవ్య గుణకర్మలు వేఱు, ద్రవ్యగుణకర్మలలో అవి యున్నవని తెలుపు సత్త వేఱని భావము.

మూ. గుణకర్మసుచ భావా న్నకర్మ నగుణః. 1-2-9

సూ. గుణకర్మలందుఁ కూడ సత్త అన్నది ఉండుటవల్ల అది గుణమునుగాదు, కర్మయును కాదు.

మూ. సామాన్యవిశేషాభావేన చ. 1-2-10

సూ. సత్తె యన్నది సామాన్య రూపముగఁగాని విశేష రూపముగఁగాని లేకపోవుటచేత సత్తె అన్నది ద్రవ్యగుణ కర్మలలో యేదియుఁ గాదు.

మూ. అనేక ద్రవ్యవత్త్వేన ద్రవ్యత్వ ముక్తం. 1-2-11

సూ. అనేక ద్రవ్యములం దుండుటచేత ద్రవ్యత్వమును ద్రవ్య గుణకర్మలకంటె వేఱైనది.

మూ. సామాన్య విశేషాభావేన చ. 1-2-12

సూ. సామాన్యముగను విశేషముగను లేకపోవుటచేత అది ద్రవ్యాదులలో యేదియుఁగాదు.

మూ. గుణేషు భావాత్ గుణత్వ ముక్తం. 1-2-13

సూ. గుణములందు ఉండుటవలన గుణత్వమును ద్రవ్యగుణ కర్మలకంటె వేఱైనది.

మూ. సామాన్యవిశేషాభావేన చ. 1-2-14

సూ. సామాన్యముగను విశేషముగను లేకపోవుటచేత గుణత్వము ద్రవ్యాదులకంటె వేఱైనది.

మూ. కర్మసు భావాత్ కర్మత్వ ముక్తం. 1-2-15

సూ. కర్మలం దుండుటవల్లఁ గర్మత్వము ద్రవ్యాదులకంటె వేఱైనది.

మూ. సామాన్య విశేషాభావేన చ. 1-2-16

సూ. సామాన్యముగను విశేషముగను లేకపోవుటచేత కర్మత్వము ద్రవ్యాదులకంటె వేఱైనది.

మూ. సదితి లింగావిశేషాత్ విశేషలింగాభావాచ్చైకో భావః. 1-2-17

సూ. ఇది సత్త అను జ్ఞానములో విశేషము లేకపోవుట చేతను భేదానుమానము లేకపోవుటచేతను సత్త యొకటే.

ఇది
శ్రీ కణాద మహర్షిచే రచింపఁబడి,
చర్ల వెంకమాంబా నారాయణశాస్త్రుల
పుత్రుఁడగు గణపతిశాస్త్రిచే తెనిఁగింపఁబడిన
వైశేషిక మీమాంసా దర్శనమున
మొదటి యధ్యాయమున
రెండవ యాహ్నికము.

---

## రెండవ యధ్యాయములో మొదటి అహ్నికము.

మూ. రూపరసగంధ స్పర్శవతీ పృథివీ. 2-1-1

సూ. రూపరసగంధ స్పర్శలు గలది భూమి.

మూ. రూపరస స్పర్శవత్య ఆపోద్రవాః స్నిగ్ధాః. 2-1-2

సూ. నీరు రూపరస స్పర్శలు ద్రవత్వము స్నేహము గలది.

మూ. తేజోరూప స్పర్శవత్. 2-1-3

సూ. రూపస్పర్శలుగలది తేజస్సు.

మూ. స్పర్శవాన్ వాయుః 2-1-4

సూ. స్పర్శగలది వాయువు.

భూమ్యాదులు పరమాణురూపములు నిత్యము. ద్వ్యణుకాదులు అనిత్యము.

మూ. త ఆకాశే న విద్యంతే. 2-1-5

సూ. ఆకాశమున రూపాదు లేవియు లేవు.

మూ. సర్పి ర్జతు మధూచ్ఛిష్టానా మగ్నిసంయోగాత్ ద్రవత్వ మద్భిః సామాన్యం. 2-1-6

సూ. నేయి లక్క మైనములు అగ్ని సంయోగమువలన ద్రవత్వముపొంది నీళ్ళకు సమానమగును.

పృథివీరూపములైన నేయి మొదలైన వానిలోని ద్రవత్వము నైమిత్తికముగాని స్వాభావికము కాదని భావము.

మూ. త్రపు సీస లోహ రజత సువర్ణానా మగ్ని సంయోగాత్ ద్రవత్వ మద్భిః సామాన్యం. 2-1-7

సూ. తేజోరూపములైన తగరమే సీసము ఇనుము వెండి బంగారములు అగ్ని సంయోగమువలన ద్రవత్వముపొంది నీటితో సమానములగును.

ఇది కంచు రాగి ఇత్తడి పాదరసము మొదలగు వాని కుపలక్షణము.

మూ. విషాణీ కకుద్మాన ప్రాంతే బాలధిః సాస్నావాన్ ఇతి గోత్వే దృష్టం లింగం. 2-1-8

సూ. కొమ్ములు గలవి మూపురముగలది కుచ్చుతోక గలది గంగడోలుగలది అనునవి గోవును గ్రహించుటలో పైకి గనుపించు లింగములు.

కొమ్ములు గలది మొదలైన లింగములను బట్టి గోవును గ్రహించునట్లే వాయువు మొదలైన వానిని స్పర్శ మొదలైన లింగములనుబట్టి గ్రహింపవలెనని తెలుపుటకై మచ్చుగా చూపఁబడెను. గోలక్షణములు 'గంగడోలుగలది' అన్నది ఇతర జంతువులకంటె విలక్షణమైన దగుటచే ఇతర జంతువ్యావర్తకమైనట్లు ఇతర వస్తువ్యావర్తక లింగములును ఆయా పదార్థ లక్షణములలో గ్రహింపవలెను.

మూ. స్పర్శశ్చ వాయోః. 2-1-9

సూ. వాయువునకు స్పర్శయె లింగము.

మూ. నచదృష్టానాం స్పర్శ ఇత్యదృష్టలింగో వాయుః 2-1-10

సూ. పైకిఁ గనిపించు పృథివ్యాదులకు స్పర్శ యొకటె లింగము గాదు, గంధాదులును గలవు. వాయువు మాత్రము పైకిఁ గనిపింపని స్పర్శ యొక్కటె లింగముగాఁ గలది.

మూ. అదద్రివ్యవత్త్వేన ద్రవ్యం. 2-1-11

సూ. ద్రవ్యముకాని స్పర్శ గుణముగాఁ గలది కాన వాయువు ద్రివ్యము.

వాయువు పృథివ్యాది ద్రవ్యములవలెఁ గంటికి కనిపించదు. పైకి కనిపించునవే ద్రవ్యము లనుకొనరాదు. గుణక్రియలు కలది ద్రవ్యము. ఇక్కడ స్పర్శ అను గుణము కలదికాన వాయువు ద్రివ్యమని భావము.

మూ. క్రియావత్త్వాత్ గుణవత్త్వాచ్చ. 2-1-12

సూ. క్రియ కలిగిన దగుటవల్లను, గుణము కలిగిన దగుటవల్లను, వాయువు ద్రివ్యము.

మూ. అద్రవ్యత్వేన నిత్యత్వ ముక్తం. 2-1-13

సూ. ఇతర ద్రవ్యముతోఁ గూడినది కాకపోవుటచే వాయువు నిత్యము ఇతర ద్రవ్యముతో అనఁగా ఇతర ద్రవ్యావయవములతోఁ గూడినది నశించును, అది అనిత్యమగును. ఇది అట్లు సావయవము కాదు కాన నిత్యమని భావము.

మూ. వాయోర్వాయు సంమూర్చనం నానాత్వేలింగం. 2-1-14

సూ. వాయువువలన వాయుతరంగములు ఏర్పడుటయె వాయువులు అనేకమగుటకు లింగము.

మూ. వాయు సంనికర్షే ప్రత్యక్షాభావాత్ దృష్టం లింగం న విద్యతే. 2-1-15

సా. వాయు సంనికర్షములో ప్రత్యక్షమగు ప్రమాణము లేక పోవుటవలన అనుమానలింగమె కాని దృష్టమగు లింగము లేదు.

మూ. సామాన్యతో దృష్టాచ్చావిశేషః 2-1-16

సా. సామాన్యతో దృష్టమనెడి యనుమాన ప్రమాణము చేతను వాయువు విశేషము లేనిది.

పూర్వవంతము శేషవంతము సామాన్యతో దృష్టము అని యనుమానము మూఁడు విధములు. కారణముచేఁ గార్యమును అనుమానించుట పూర్వవంతము. ఉదా: మబ్బులను బట్టి వర్షము కురియునని యూహించుట. కార్యముచే కారణమును ఊహించుట శేషవంతము.

ఉదా:-నదుల వరదలను బట్టి వర్షము కురిసినదని యూహించుట. అప్రత్యక్షమగు కారణ సామాన్యమును బట్టి కార్యము తోఁచుట సామాన్యతో దృష్టము.

ఉదా:-ఇచ్ఛాదులను బట్టి వానికి స్థానమగు ఆత్మ వ్యక్తమగుట. సామాన్యతో దృష్టమను అనుమానమువల్ల అనఁగా అప్రత్యక్ష కారణములచే సిద్ధించుటవల్ల వాయువు విశేషము లేనిది. ప్రత్యక్షముగాఁ గనిపించు వస్తువులలోనే కాని యితర వస్తువులలో విశేషములు కనిపించవు కాన వాయువు విశేషము లేనిదని భావము.

మూ. తస్మాదాగమికం. 2-1-17

సా. వాయువు ద్రవ్యమగుటవల్ల వాయునామము ఆగమ సిద్ధమైనది.

"వాయుర్వై క్షేపిష్ఠా దేవతా" వాయువనునది వస్తువులను చిమ్మునట్టి దేవత. ఇత్యాది వేద వాక్యములచే ఆ చిమ్మునట్టిది వాయువు అను నామము ఆగమసిద్ధము.

మూ. సంజ్ఞాకర్మ త్వస్మద్విశిష్టానాం లింగం. 2-1-18

వేదములందలి సంజ్ఞలు, కర్మలయితే మనకంటె విశిష్టులగు వాయుమహర్షి వరుణ పరమాత్మలకు సూచకము.

ఆయా దేవతానామములను బట్టి సృష్ట్యాది కార్యములు వాయువును సూచించునట్లు మహర్షి వరుణేంద్ర పరమేశ్వరులు పైకి కనుపింపకున్నను వారు ఉన్నారనుటకు హేతువులని భావము.

మూ. ప్రత్యక్ష ప్రవృత్తత్వాత్ సంజ్ఞా కర్మణః. 2-1-19

సూ. ఆయా దేవతల నామములు వారి కర్మలు ప్రత్యక్షములైన కార్యములందు ప్రవర్తించుటవలన వానికి కారణములగు దేవతాదు లున్నారు.

డిత్థ డవిత్థాది నామములు, క్షిత్యాది భూతములు సూర్యచంద్ర నక్షత్రాదులు లోకాదులు నగు కార్యములు ప్రత్యక్షములు. వానికి కర్తలుండి తీరవలెను. ఆకర్తలగు వరుణేంద్ర పరమేశ్వరాదులకు సూచకములని భావము.

మూ. నిష్క్రమణం ప్రవేశన మిత్యాకాశ లింగం. 2-1-20

సూ. నిష్క్రమించుట ప్రవేశించుట అనునవి యాకాశమునకు సూచకము.

ఇవి యుపలక్షణములు కాన ఉత్క్షేపణాదులును ఆకాశమునకు సూచకములు. ఆకాశమనగా అవకాశము. ఖాళీప్రదేశము. ఖాళీప్రదేశము లేనిచో వెడలుట ప్రవేశించుట ఎత్తుట మొదలగు కర్మలు కుదురవు. కాన వీనిని బట్టి ఆకాశ మున్నదని సిద్ధించుచున్నదని భావము.

మూ. తదలింగ మేకద్రవ్యత్వాత్కర్మణః. 2-1-21

సూ. నిష్క్రమించుట మొదలగునవి ఒక మూర్త ద్రవ్యమునందు మాత్రమె యుండును. ఆకాశము మూర్తద్రవ్యము కాదు కాన పైకర్మలు ఆకాశ మున్నదనుటకు సూచకములు కావు.

ఇది పూర్వపక్షసూత్రము. కారణము సమవాయి అసమవాయి నిమిత్తము అని మూఁడు విధములు. దేనియందుఁగలసి యుండుటచే కార్యము పుట్టునో అది సమవాయి కారణము. ఉదా:- మట్టి కుండకు దారములు వస్త్రమునకును సమవాయి కారణము. కారణముకుఁగాని కార్యముకుఁగాని కలిసియుండిన కారణము అసమవాయి కారణము. ఉదా:- మట్టి సంయోగమును రూపమునుబట్టి కుండయు దాని రూపమును, దారముల సంయోగమును రూపమునుబట్టి వస్త్రము దాని రూపమును గలుగుచున్నవి. వానిలో సంయోగమును రూపమును అసమవాయి కారణములు. కుండ వస్త్రము అగుటకు దండము చక్రము కుమ్మరి మగ్గము సాలెవాఁడు మొదలగునవి నిమిత్త కారణములు. సమవాయి అసమవాయి కారణముల కంటె భిన్నమైనవి నిమిత్త కారణములు. ఈ కర్మలు ఆకాశమునకు సమవాయి కారణము కాదని నిషేధింపబడినది. కుండ, బట్ట మొదలగువానికి మట్టి దారములు మొదలగు మూర్తద్రవ్యములె సమవాయి కారణముగా నున్నవి. ఆకాశము మూర్తద్రవ్యము కాదు కాన ఆకాశము సమవాయి కారణము కాదని పూర్వపక్ష యాక్షేపము.

సూ. కారణాంతరానుక్లప్తి వైధర్మ్యాచ్చ. 2-1-22

సూ. సమవాయికంటె నితర కారణములను కల్పించుటలో వైధర్మ్యము ఉండుటవలనను ద్రవ్యములకు సంబంధించిన కర్మలు అసమవాయి కారణము కావు. అసమవాయి నిమిత్తములు ఆకాశమున నుండవు. ఆకాశము నిష్క్రమణాదులకు కారణము కాదు గనుక దానిని బట్టి ఆకాశము ద్రవ్యముగా నంగీకరించుట సరికాదని ఆక్షేపము.

సూ. సంయోగాదభావఃకర్మణః 2-1-23

సూ. మూర్తిగల ద్రవ్యముతో సంయోగముండుటవలన కర్మయుండదు కాని యాకాశము లేకపోవుట కాదు. ఒక వస్తువు నిసరి

నపుడు దాని పిదపనున్న యితరవస్తు సంయోగమువలనఁగాని, గురుత్వ శక్తి ప్రతిబంధకమగుటవలనఁగాని వేగమాగి కర్మ ముగియును కాని పిదప ఆకాశము లేకపోవుటవలనఁ గాదు. అందుచే ఆకాశము అంతటను ఎల్లపుడును ఉండనే యున్నది. అది కర్మకంటె పూర్వమే యున్నది. కాన కర్మకు ఆకాశమును ఏవిధముగను కారణముగా చెప్పరాదు. కనుక ఆకాశము కర్మకు నిమిత్త కారణమును కాదు. ఆకాశము తేఁచో వస్తువుల కదలికయె శక్యముకాదు. కాన ఆ కదలికనుబట్టి ఆకాశమను ద్రవ్యమున్నట్లు అనుమానింపఁబడుచున్నదని భావము.

మూ. కారణగుణపూర్వకః కార్యగుణోదృష్టః 2-1-24

కార్యములందున్న గుణములు కారణగుణములనుబట్టి వచ్చినవిగఁ జూడఁబడుచున్నవి.

మూ. కార్యాంతరాఽప్రాదుర్భావాచ్ఛబ్దః స్పర్శవతామగుణః 2-1-25

సూ. ఇతర కార్యములందు పుట్టకపోవుటవలన శబ్దము స్పర్శకలవానికి గుణముగాదు.

మూ. పరత్రసమవాయాత్ ప్రత్యక్షత్వాచ్చ నాత్మగుణో న మనోగుణః 2-1-26

సూ. ఆత్మ మనస్సులకంటె నితరమగుచోట్ల ఉండుట వలనను అంతరింద్రియమగు చిత్తమునకు వెలుపలనున్న యింద్రియములకు ప్రత్యక్ష మగుటవలనను ఆశబ్దము ఆకాశగుణమె గాని ఆత్మకుఁగాని మనస్సునకుఁగాని గుణము కాదు.

ఆత్మ మనశ్శబ్దములు దిక్కాలములకును ఉపలక్షణము. కనుక శబ్దము దిక్కునకును కాలమునకును గుణముకాదని తెలియునది.

మూ. పరిశేషాల్లింగ మాకాశస్య. 2-1-27

సూ. ఇంక మిగిలినది ఆకాశముకాన శబ్దము ఆకాశమునకు సూచకము.

ఇందుచే శబ్దమొకటె ఆకాశమునకు సూచకముకాని నిష్క్రమణాదులు లింగముకావని భావము.

మూ. ద్రవ్యత్వ నిత్యత్వే వాయునా వ్యాఖ్యాతే. 2-1-28

సూ. వాయువువలె ఆకాశమును నిరవయవముకాన అది నిత్యమును, గుణము కలదికాన ద్రవ్యము నగు.

మూ. తత్త్వం భావేన. 2-1-29

సూ. పృథివ్యాదులందు సత్త యొకటె యయినట్లు ఆకాశము ఒకటి.

మూ. శబ్దలింగాఽవిశేషా ద్విశేషలింగా భావాచ్చ. 2-1-30

సూ. శబ్దరూపమైన లింగ మొకటె విశేషముగాఁ గలదగుట వలనను ఆకాశములు భిన్నములని తెలిపెడి యితర విశేష లింగములు లేకపోవుటవలనను ఆకాశ మొకటెయని సిద్ధించినది.

మూ. తదనువిధానా దేక పృథక్త్వం చేతి. 2-1-31

సూ. పైదానిని బట్టి శబ్దము ఆకాశమునకు గుణముగ విధించుట వలననే యాకాశ మొకటె యనియు ఇతర ద్రవ్యములకంటె వేఱైనది అనియు సిద్ధించినది.

ఇది

కణాది మహర్షిచే రచింపఁబడి చర్ల వెంకమాంబా

నారాయణ శాస్త్రిల తనయుఁడగు

గణపతిశాస్త్రిచే అనువదింపఁ బడిన

రెండవ యధ్యాయమున

మొదటి యాహ్నికము.

---

## రెండవ యధ్యాయమున రెండవ యాహ్నికము

మూ. పుష్పవస్త్రయోః సతి సంనికర్షే గుణాంతరాఽప్రాదుర్భావో వస్త్రే గంధాభావలింగం. 2-2-1

సూ. పువ్వులకు వస్త్రములకు సంబంధ మున్నపుడు గంధము కంటె నింకొక గుణము పుట్టకపోవుట, వస్త్రమందు గంధము లేదనుటకు సూచకము.

వస్త్రముః దగ్గర పువ్వు లున్నప్పుడున్న గంధము ఆ పువ్వుల వలనఁ గలిగిన యౌపాధిక (నైమిత్తిక) గంధమె కాని స్వాభావికము కాదు. కారణములగు దారములం దేగుణములున్నవో యవే కార్యమగు వస్త్రమందుఁ గనిపించును. కారణములందు లేని గుణములు కార్యములందుఁ గనిపించినచో అవి యౌపాధిక (నైమిత్తిక)ములే కాని స్వాభావికములు కావు. దేనికైనను లక్షణము చెప్పవలసి వచ్చినపుడు స్వాభావికములగు గుణములను బట్టియె చెప్పవలయును. కాని యౌపాధిక గుణములను బట్టి చెప్పరాదని భావము.

మూ. వ్యవస్థితః పృథివ్యాం గంధః. 2-2-2

సూ. పృథివియందు గంధముకలదు.

పృథివికి గంధము గలిగియుండుట లక్షణమని భావము.

మూ. ఏతేనోష్ణతా వ్యాఖ్యాతా. 2-2-3

సూ. దీనిచే అగ్నికి ఉష్ణత్వ ముండునని వ్యాఖ్య చేయబడినది.

మూ. తేజస ఉష్ణతా. 2-2-4

సూ. తేజస్సునకు ఉష్ణత్వము స్వాభావిక గుణము.

మూ. అప్సు శీతతా. 2-2-5

సూ. నీళ్ళయందు శైత్యము స్వాభావిక గుణము.

మూ. అపరస్మి న్నపరం యుగపచ్చిరం క్షిప్రమితి కాల లింగాని. 2_2_6

సూ. పూర్వమందున్న దానియందు పూర్వపుది యని ఒక్క మాటుది, చాలకాలపుది, వేగముగలది అనునవి కాలమునకు సూచకములు.

భూతభవిష్య ద్వర్తమానములందు జరిగిన కార్యములు కాలమునకు సూచకము.

మూ. ద్రవ్యత్వ నిత్యత్వే వాయునా వ్యాఖ్యాతే. 2_2_7

సూ. వాయువువలె కాలమును నిరవయవము కాన నిత్యమును, గుణముగలది కాన ద్రవ్యమును అగునని వ్యాఖ్యానము చేయబడినది.

మూ. తత్త్వం భావేన.  2_2_8

సూ. సత్త యొక్కటె యయినట్టే కాలమును ఒకటే. 

మూ. నిత్యేష్వభావా దనిత్యేషు భావాత్ కారణే కాలాఖ్యేతి 2_2_9



సూ. నిత్యపదార్థములందు ముందు వెనుక తర్వాత అను వ్యవహారము లుండకపోవుటవల్ల, అనిత్యపదార్థములం దవి యుండుటవల్ల వానికి గారణమైనదానియందు కాలమను పేరు గలిగినది.

ఆకాశాది నిత్యపదార్థములందు ఇదివరకు పుట్టినది ఒకసారి పుట్టినది చాలకాలముక్రిందట పుట్టినది వేగముగా పుట్టినదను జ్ఞానము లేకుండుటవల్లను కుండ బట్ట మొదలైన యనిత్యవస్తువులందు ఇప్పుడు చేసినది పగలుచేసినది ఇత్యాది వ్యవహారజ్ఞానము ఉండుటవల్లను కాలము కారణము అగునని భావము.

మూ. ఇత ఇదమితి యత స్తద్దిశ్య లింగం 2_2_10

సూ. దీనికంటె నిది దీనికంటె అది అని యొక్కదానినిబట్టి యుద్దేశింపఁబడినది దిక్కునకు సూచకము. ఈ యింటికిది తూర్పు, దీనికిది పడమర ఇది యుత్తరము ఇది దక్షిణము మొదలగు వ్యవహారములు దిక్కునకు సూచకము.

మూ. ద్రవ్యత్వ నిత్యత్వే వాయునా వ్యాఖ్యాతే 2-2-11

సూ. వాయువువలె నిరవయవముగాన దిక్కు నిత్యత్వమును గుణము కలది కాన ద్రవ్యమునగు.

మూ. తత్త్వంభావేన. 2-2-12

సత్తయొకటి అయినట్లే దిక్కును ఒకటె.

మూ. కార్య విశేషేణ నానాత్వం. 2-2-13

సూ. కార్యభేదము చేత దిక్కుకు నానాత్వము గల్గినది.

మూ. ఆదిత్య సంయోగాత్ భూత పూర్వాత్ భవిష్యతో భూతాచ్చ ప్రాచీ. 2-2-14

సూ. ఇదివరకు జరిగినట్టియు, జరగబోవునట్టియు, జరుగుచున్నట్టియు సూర్యసంయోగమువల్ల తూర్పు అను వ్యవహారము కలిగెను.

మూ. తథా దక్షిణా ప్రతీచ్యుదీచ. 2-2-15

సూ. ఇట్లే దక్షిణ పడమర ఉత్తరము అని వ్యవహారము కలిగెను.

మూ. ఏతేన దిగంతరాళాని వ్యాఖ్యాతాని. 2-2-16

సూ. దానిచే దిక్కుల మధ్యభాగము ఐశాన్యాది మూలలు వ్యాఖ్యానము చేయబడినవి.

మూ. సామాన్య ప్రత్యక్షాత్ విశేషాప్రత్యక్షాత్ విశేష స్మృత్యేశ్చ సంశయః 2-2-17

సూ. సామాన్యమగు రూపాదులు ప్రత్యక్షమగుటవల్లను ఒక దానినుండి వేఱు విశేష రూపములు ప్రత్యక్షము కాకపోవుటవల్లను వేఱు చేయు విశేషము జ్ఞప్తికివచ్చుటవల్లను సంశయము కలుగుచున్నది.

దూరమందున్న స్తంభమును జూచి మనుష్యు డనుకొనుటకో మనుష్యునివలె నిలఁబడి యుండుటయును సామాన్య విషయము దూరమునకు ప్రత్యక్షమగును. స్తంభమునుండి వేఱుచేయు చేతులు కాళ్లు మొదలైనవి ప్రత్యక్షము కాకపోవుటవల్లను కాళ్లు చేతు లున్నవాఁడే మనుష్యుడని జ్ఞాపకము వచ్చుటచేతను ఇది స్తంభమా? మనుష్యుడా? అని సందేహము కలుగును.

మూ. దృష్టంచ దృష్టవత్. 2-2-18

సూ. ఇదివఱకు చూడబడినదానివలె చూడబడినదియు సంశయ హేతువగును.

మూ. యథాదృష్ట మయథాదృష్టత్వాచ్చ. 2-2-19

సూ. ఇదివఱకొక విధముగాఁ జూడఁబడిన దింకొకవిధముగా చూడబడుటవల్లను సంశయము కలుగును. జుట్టుకలవాడు జుట్టుతీసి వేయగా ఇతడతడా? అని సంశయము.

మూ. విద్యాఽవిద్యాతశ్చ సంశయః 2-2-20

సూ. విద్య యవిద్యలవల్లను సంశయము కలుగును జ్ఞానికి అజ్ఞాని చెప్పినదానినిబట్టి అజ్ఞానికి జ్ఞాని చెప్పినను తన యజ్ఞానమువల్ల సంశయము కలుగును.

మూ. శ్రోత్రగ్రహణో యోఽర్థః సశబ్దః 2-2-21

సూ. చెవి గ్రహించు పదార్థము శబ్దము.

మూ. తుల్యజాతీయేష్వర్థాంతర భూతేషు విశేషస్య ఉభయథా దృష్టత్వాత్. 2-2-22

సూ. సమానముగఁ దోఁచు వేర్వేఱు ద్రవ్యాదులందు విశేషము రెండు విధములుగా తోఁచుటవల్ల శబ్దమందు సంశయము ఇంద్రియములచే రూప రసాదులు గ్రహింపబడునట్లు శబ్దమును గ్రహింపఁబడుటచే శబ్దము గుణమనియు, శబ్దమందు తేలికయైన బరువైన గుణములు

తోచుటచే ఆ గుణముల కాశ్రయమైనది ద్రవ్యము కాన ద్రవ్యమనియు తోచుచున్నది. దీనిచే శబ్దము గుణమా? ద్రవ్యమా? కర్మయా అని సంశయము కల్గుచున్నది.

మూ. ఏకద్రవ్యత్వాన్న ద్రవ్యం. 2-2-23

సూ. ఒక ఆకాశ ద్రవ్యమందె సమవాయిగా నుండుటవలన శబ్దము ద్రవ్యముగాదు.

మూ. నాఽపి కర్మాఽచాక్షుత్వాత్. 2-2-24

సూ. కంటికిఁ గనిపింపక పోవుటవల్ల శబ్దము కర్మ కాదు. కర్మ కంటికి గోచరించును, శబ్దము చెవికి గోచరించునని భావము.

మూ. గుణస్య సతోఽపవర్గః కర్మభిః సామాన్యం. 2-2-25

సూ. గుణమునకు కర్మలతోపాటు తాను పుట్టిన తరువాత నశించుట యను సమానధర్మము మాత్రమే కలదు.

మూ. సతో లింగాభావాత్. 2-2-26

సూ. సత్తు అనగా ఉన్నదనుటకు లింగము లేకపోవుటవల్ల శబ్దము అనిత్యము.

మూ. నిత్య వైధర్మ్యాత్. 2-2-27

సూ. ఇతర నిత్య పదార్థములతో సమానధర్మము లేకపోవుట వలన అది అనిత్యము.

మూ. అనిత్యశ్చాయం కారణతః. 2-2-28

సూ. భేరీ దండాది కారణమును బట్టి కలుగుచున్నవి కాన శబ్దము అనిత్యము.

మూ. నచాఽసిద్ధం వికారాత్. 2-2-29

సూ. భేరీ దండాదులవల్ల మంద్ర మధ్య తీవ్రాదిశబ్ద వికారములు కలుగుటవలన శబ్దము భేరీ దండాదులచే సిద్ధించినది కాదనరాదు.

మూ. అభివ్యక్తౌ దోషాత్. 2-2-30

సూ. శబ్దము యొక్క అభివ్యక్తిలో దోష ముండుట వలన శబ్దము పుట్టక అభివ్యక్త మగు ననరాదు.

మూ. సంయోగాత్ విభాగా చ్ఛబ్దాచ్ఛబ్ద నిష్పత్తిః. 2-2-31

భేరీదండాది సంయోగమువల్లను వెదుళ్లు మొదలగు వానిని చీల్చుట వల్లను శబ్దమువల్లను శబ్దము పుట్టుచున్నది. కంఠమందు తాలు దంతాది సంయోగమువల్ల శబ్దములు పుట్టునని తెలియునది.

మూ. లింగాచ్చానిత్యః శబ్దః. 2-2-32

సూ. లింగమునుబట్టియు శబ్దము అనిత్యము.

భేరీదండాదుల శబ్దము ఎట్లు శ్రోత్ర గ్రాహ్యమో అట్లే వర్ణ పదాత్మక శబ్దముకూడ శ్రోత్ర గ్రాహ్యమె యగునుగాన శబ్దము అనిత్యమె అని భావము.

మూ. ద్వయోస్తు ప్రవృత్త్యో రభావాత్. 2-2-33

సూ. వక్తలు శ్రోతలిద్దఱి ప్రవృత్తులు వేఱుగా నుండకపోవుట వల్ల శబ్దము నిత్యము.

ఇక్కడనుండి మూడు సూత్రములలో పరమత సమ్మత నిత్యత్వ మును జెప్పుచున్నాడు. గురువు చెప్పును. దానినె శిష్యుడు చదువును. రెండు నొకటిగానె యున్నవిగాన శబ్దము నిత్యమని భావము.

మూ. ప్రథమాత్. 2-2-34

సూ. శ్రుతులలో ప్రథమ శబ్దయోగమువల్లను శబ్దము నిత్యము.

"ద్విః ప్రథమా మన్వాహ త్రిరుత్తమాం" మొదటి సామము రెండుసార్లు పలికెను. చివరదానిని మూడుసార్లు పలికెను. అనువానిలో మొదటి సామము స్థిరముకానిచో దిరుగ దానిని పలుకుట పిలుపడదు కదా. కాన దీనిని బట్టియు శబ్దము నిత్యమని పరమతము.

మూ. సం ప్రతిభావాచ్చ. 2-2-35

సూ. తిరుగ తిరుగ ఇదివఅకటిదే స్మృతికి వచ్చుటవల్ల శబ్దము నిత్యము.

మూ. సందిగ్ధాః. 2-2-36

సూ. పైన చెప్పినవి వివిధముగ నుండుటవలన సందిగ్ధములు. ఇది సిద్ధాంత సూత్రము

మూ. సతి బహుత్వే సంఖ్యాభావః సామాన్యతః. 2-2-37

సూ. అకారాది సామాన్యజాతినిబట్టి వర్ణము సంఖ్య సిద్ధించును. అకారాదులు జాతినిబట్టి సంఖ్య సిద్ధించును కాన వర్ణములు అనంతము లనరాదని భావము.

ఇది

శ్రీ కణాద మహర్షిచే రచింపఁబడి,

చర్ల వెంకమాంబా నారాయణశాస్త్రుల

తనయుఁడగు గణపతిశాస్త్రిచే తెనిఁగింపఁబడిన

వైశేషిక మీమాంసా దర్శనమున

రెండవ యధ్యాయమున

రెండవ యాహ్నికము.

---

# మూడవ యధ్యాయమున మొదటి అహ్నికము.

మూ. ప్రసిద్ధా ఇంద్రియార్థాః. 3-1-1

సూ. ఇంద్రియ విషయములైన రూపరసగంధ శబ్ద స్పర్శలు ప్రసిద్ధములు. కన్ను రూపమును నాలుక రసమును ముక్కు గంధమును చెవి శబ్దమును చర్మము స్పర్శను గ్రహించును.

మూ. ఇంద్రియార్థ ప్రసిద్ధి రింద్రియార్థేభ్యోఽర్థాంతరస్య హేతుః. 3-1-2

సూ. ఇంద్రియములు వాని విషయమును అనుభవించుట ప్రసిద్ధి. ఆ యింద్రియ విషయములకంటె వానిని ప్రేరేపించునది ఇంకొకటి యున్నదనుటకు హేతువు.

గంధాది విషయములను గ్రహించు ఘ్రాణా దీంద్రియములకు ప్రయోక్త ఆత్మయని భావము.

మూ. సోఽన పదేశః. 3-1-3

సూ. విషయములను శరీరము గ్రహించునను (కః=) హేతువు, సరియైన హేతువు కాదు. (అనపదేశము)

గంధాది జ్ఞానమునకు శరీరమే హేతువు అనునది సరియైన హేతువుగాదు. గంధాదులను గ్రహించునది యాత్మయెకాని శరీరము కాదని భావము.

మూ. కారణాజ్ఞానాత్. 3-1-4

సూ. శరీర కారణములగు భూతములకు విషయములకు జ్ఞానము లేకపోవుటవలన ఆత్మయె కాని శరీరము ప్రయోక్తకాదు.

మూ. కార్యేషు జ్ఞానాత్. 3-1-5

సూ. ఘటపటాది కార్యములందు జ్ఞానముండవలసి వచ్చుట వలన ఘటాదులకు కారణములగు పృథివ్యాది పరమాణువులందు జ్ఞానమున్నదనరాదు.

మూ. అజ్ఞానాత్ చ. 3-1-6

సూ. తత్కార్యములగు ఘటాదులందు జ్ఞానము లేకపోవుట వలనను శరీర కారణములు గంధాది జ్ఞానమునకు హేతువులు కావు.

మూ. అన్యదేవ హేతురిత్య నపదేశః. (అహేతుః) 3-1-7

సాధింపఁ దగినదానికంటె నితరమైనదే హేతువగును కాని సాధింపఁ దగినది హేతువు కాదు.

సాధింపఁదగిన యాత్మకు గంధాదిజ్ఞానమె హేతువగును కాని ఆ సాధింపఁదగినదే హేతువు కాదు. ఘ్రాణాదులతో నాత్మకు తాదాత్మ్యమునాని అవి ఉత్పత్తిస్థానములుగాని కావు. ఆత్మజ్ఞానము అనుమానముచే సిద్ధించును.

మూ. అర్థాంతర మర్థాంతర స్యానపదేశః. 3-1-8

సూ. ఇతర పదార్థము దానికంటె నితరమైన పదార్థమునకు హేతువు కాదుకదా.

అగ్ని మొదలగువానికి కార్యములగు ధూమాదులు అశ్వము మొదలగు వానికంటె నితరములైనట్లే అగ్ని మొదలగు వానికిని ఇతరములె. ధూమాదులకు సంబంధించినవగు అగ్ని మొదలగునవి ధూమాదులకుఁ గారణమైనట్లు గంధాది జ్ఞానము దానికి సంబంధించిన ఆత్మయున్న దనుటలోఁ గారణ మగును కాని దానికంటె నితరమగు శరీర గుణములు తద్భిన్నమైన యాత్మకు కారణములు గావు. గంధాది జ్ఞానమునకు ఆత్మకు అవినాభావ సంబంధము ఉన్నందువల్ల గంధాది జ్ఞానము ఆత్మకు సూచకమగునని భావము.

మూ. సంయోగి సమవాయ్యేకార్థ సమవాయి విరోధిచ. 3-1-9

సూ. సంయోగి, సమవాయి, ఏకార్థ సమవాయి విరోధి అనునవియును సరియగు హేతువులు కావు.

'శరీరము శరీరమగుటవలన చర్మముకలది' అనుమాట శరీరమగుటవలన అను హేతువును సంయోగి అందురు. చర్మము శరీర కార్యముకాని తత్కారణముకాని కాదు. అది శరీరముతో కూడఁ బుట్టినది. కాన నిది యెప్పుడును శరీరమునకు సంయోగము కలిగి యుండును. కాన ఇది పైకి హేతువువలె కనిపించును కాని సరియైన హేతువు కాదు. సమవాయి:—ఆకాశము ద్రవ్యమగుటవలన ఘటమువలె పరిమాణము కలది. ఇట పరిమాణము ఆకాశ సమవాయి యగు ద్రవ్యత్వముచే సాధింపఁ బడుచున్నది. కాన ఇదియును సరియైన హేతువుకాదు. ఏకార్థ సమవాయియు విరోధియు ముందు సూత్రములలో చెప్పబడుచున్నవి.

మూ. కార్యం కార్యాంతరస్య. 3-1-10

సూ. ఒక కార్యము మరియొక కార్యమునకు సూచకమై ఏకార్థ సమవాయి యనఁబడును.

ఘటమందుఁ గార్యముగ నున్న రూపము మఱియొక కార్యమగు స్పర్శకు సూచకము. ఇట రూపమును స్పర్శయును ఒకే వస్తువగు ఘటమందు సమవాయి సంబంధముతో నున్నవి కాన ఏకార్థసమవాయి.

మూ. విరోధ్య భూతం భూతస్య 3-1-11

సూ. జరిగినదానికి జరగనిది విరోధి.

ఇదివరలో వర్షము కురియుట జరిగినది. ఆవర్షమునకు కారణమైన వాయు మేఘ సంయోగమునకు ముందు కురవక పోవుటకుఁ గారణమైన వాయు మేఘ సంయోగము లేకుండుట విరోధి. స్ఫోటాదులకు మంత్రపాఠము విరోధి.

మూ. భూత మభూతస్య. 3-1-12

సూ. జరిగినది జరగనిదానికి విరోధి.

వాయు మేఘ సంయోగము కురియకుండుటకు కారణమైన వాయు మేఘ సంయోగము లేకుండుటకు విరోధి. స్ఫోటాదికము మంత్రసాధనకు విరోధి.

మూ. భూతో భూతస్య. 3-1-13

సూ. ఉన్నది ఉన్నదానికి విరోధి.

ఉన్న నీటికి ఉన్న నిప్పు విరోధి. ఇట్లే పామునకు ఉన్న ముంగిస విరోధి.

మూ. ప్రసిద్ధి పూర్వకత్వా దపదేశస్య. 3-1-14

సూ. హేతువు ప్రసిద్ధి పూర్వకమయి యుండునట్లు హేతువగును. ప్రసిద్ధి=వ్యాప్తితో ప్రసిద్ధమై యుండుట, ధూమాగ్నులకు వలె గంధాది జ్ఞానమునకు ఆత్మకును వ్యాప్తిగలదు కాన ఇది హేతువగు చున్నది. కాన గంధాది జ్ఞానమునకు శరీర కారణ గుణములకు వ్యాప్తి లేదు కాన అది హేతువు కాదని భావము.

మూ. అప్రసిద్ధోఽనపదేశః. 3-1-15

సూ. అప్రసిద్ధము సరియగు హేతువు కాదు.

మూ. అసన్ సందిగ్ధశ్చ అనపదేశః. 3-1-16

సూ. అపక్షధర్మము సందిగ్ధమును హేతువులు కావు.

అప్రసిద్ధము అపక్షధర్మము సందిగ్ధము అనునవి హేత్వాభాసము లని భావము. అప్రసిద్ధము=వ్యాప్తిలేనిది. విరుద్ధ వ్యాప్తిగలది. అపక్ష ధర్మము=పక్షము కానిదానితో ధర్మము కలది=అనైకాంతికము; సందిగ్ధము=సందిగ్ధమైన వ్యాప్తిగలది.

మూ. యస్మాద్విషాణీ తస్మాదశ్వః. 3-1-17

సూ. కొమ్ములు గలదికాన ఇది గుఱ్ఱము అనునది యప్రసిద్ధ మున కుదాహరణము.

మూ. యస్మాద్విషాణీ తస్మాద్గౌరితి చానైకాంతిక స్యోదాహరణం. 3-1-18

సూ. కొమ్ములుగలదిగాన ఇది గోవు అనునది అపక్ష ధర్మమున కుదాహరణము.

పక్షము (గోవు) కాని మహిషాదులందును కొమ్ము లుండుటచే అనైకాంతికము. అపక్షధర్మము. గోవు కానివానియందు గూడ లక్షణము పట్టుట అనైకంతికము.

మూ. ఆత్మేంద్రియార్థ సంనికర్షాత్ యన్నిష్పద్యతే తదన్యత్ 3-1-19

సూ. ఆత్మేంద్రియార్థ సంనికర్షవశమున పుట్టిన యాత్మకు లింగమైన జ్ఞానము అప్రసిద్ధాది హేత్వాభాసలకంటె భిన్నమైనది.

ఆత్మ యున్నదనుటలో గంధాది జ్ఞానము సరియైన హేతువు. ఇది హేత్వాభాసము కాదుకాన అర్థనిర్ణాయక మగును.

మూ. ప్రివృత్తి నివృత్తీచ ప్రిత్యగాత్మని దృష్టేపరత్ర లింగం. 3-1-20

సూ. తన యాత్మయందుఁ గనుపట్టు ప్రవృత్తి నివృత్తులు ఇతరులందును గనుపట్టు చుండుటవలన అవి ఇతరులందలి యాత్మకును సూచకములు.

ప్రవృత్తి నివృత్తులు ఇచ్ఛా ద్వేషములనుబట్టి కలిగినట్లు ఇతరులకును గలుగును కాన మనకువలెనే ఇతరులకును ఆత్మయున్నట్లు సూచక మగుచున్నదని భావము.

ఇది కణాది మహర్షిచే రచింపఁబడి చర్ల వెంకమాంబా
నారాయణ శాస్త్రిల తనయుఁడగు
గణపతిశాస్త్రిచే అనువదింపఁబడిన
వైశేషిక మీమాంసా దర్శనమున
మూడవ యధ్యాయమున
మొదటి యాహ్నికము.

---

## మూడవ యధ్యాయమున రెండవ అహ్నికము.

మూ. ఆత్మేంద్రియార్థ సంనికర్షే జ్ఞానస్య భావోఽభావశ్చ మనసోలింగం. 3-2-1

సూ. ఆత్మకు ఇంద్రియములతోడను విషయములతోడను సంనికర్ష మున్నప్పుడు ఒకప్పుడు జ్ఞానము కలుగుటయు ఒకప్పుడు జ్ఞానము కలుగకపోవుటయు మనస్సు అనునది యొకటి యున్నదనుటకు సూచకము.

మనస్సు ఆయా విషయములమీద ఉన్నప్పుడు ఆయా జ్ఞానములు కలుగుటయు ఆవిషయములమీద లేనపుడు కలుగక పోవుటయు జరుగునని భావము.

మూ. తస్య ద్రవ్యత్వ నిత్యత్వే వాయునా వ్యాఖ్యాతే. 3-2-2

సూ. మనస్సు వాయువువలె నిరవయవముకాన నిత్యమును గుణము కలదికాన ద్రవ్యమునగు.

మూ. ప్రయత్నాయౌగ పద్యాత్ జ్ఞానాయౌగ పద్యాచ్చైకం. 3-2-3

సూ. ప్రతి శరీరములోను ప్రయత్నములు జ్ఞానములు ఒక్కసారిగా జరగకపోవుటవలన మనస్సొకటే. మనస్సులు అనేకమైనచో వాని ప్రయత్నములు జ్ఞానములు ఒక్కసారిగానే జరగవలసి వచ్చును. అట్లు జరగుటలేదు కాన మనస్సొకటె. నాట్యాదులలో కర చరణాద్యవయవముల కదలికలు మనోవేగమును బట్టి యొక్కసారిగా జరుగుచున్నట్లు కనిపించును కాని వానికి సూక్ష్మమైన కాలభేదము లేకపోలేదని భావము.

మూ. ప్రాణాపాన నిమేషోన్మేష జీవన మనో గతీంద్రియాంతర వికారాః సుఖదుఃఖేచ్ఛా ద్వేష ప్రయత్నాశ్చాత్మనో లింగాని. 3-2-4

సూ. ప్రాణాపానములు నిమేషోన్మేషములు జీవనము మనోగమనము ఇంద్రియ వికారములు సుఖదుఃఖాదులు ఇచ్ఛాద్వేషములు ప్రయత్నములను ఆత్మకు సూచకములు.

ప్రాణాదులనుబట్టి వానికి కర్తయయిన ఆత్మ యున్నదని సూచితమగుచున్నదని భావము.

మూ. తస్య ద్రవ్యత్వ నిత్యత్వే వాయునా వ్యాఖ్యాతే. 3-2-5

సూ. ఆత్మ వాయువువలె నిరవయవముకాన నిత్యమును గుణములు గలదికాన ద్రవ్యమునగు.

మూ. యజ్ఞదత్త ఇతి సన్నికర్షే ప్రత్యక్షాభావాత్ దృష్టం లింగం నవిద్యతే. 3-2-6

సూ. వీడు యజ్ఞదత్తుఁడని యన్నపుడు యజ్ఞదత్తుని శరీరము దగ్గరగా నున్నను ఆత్మ ప్రత్యక్షము కాకపోవుటవలన ఆత్మను సాధించు ప్రత్యక్ష చిహ్నములేదు.

ఆత్మ దృష్టము కానట్లె సామాన్యతో దృష్టమనెడి అనుమాన ప్రమాణముచేతను ఊహింపఁబడకపోవుట వలనను ప్రత్యక్ష ప్రమాణమునకు సమానమైనట్లె.

మూ. తస్మాదాగమికః. 3-2-7

సూ. కనుక ఆత్మ ఆగమ ప్రమాణసిద్ధమె.

ఈ 6, 7 సూత్రములు పూర్వపక్ష సూత్రములు.

మూ. అహమితి శబ్దస్య వ్యతిరేకా న్నాగమికం. 3-2-8

సూ. 'నేను యజ్ఞదత్తుఁడను' అని నేను అను పదము నేను భూమ్యాదులను కాను అని యీవిధముగా పృథివ్యాదుల కంటె వ్యావృత్తికల దగుటవలన ఆత్మ అనుమానసిద్ధమెకాని ఆగమసిద్ధ మనరాదు. ఇది సిద్ధాంత సూత్రము.

మూ. యదిదృష్ట మన్వక్షమహం దేవదత్తోఽహం యజ్ఞదత్త ఇతి. 3-2-10

సూ. 'నేను దేవదత్తుఁడను, నేను యజ్ఞదత్తుఁడను' అని తద్దర్శనము ప్రత్యక్ష మగుచుండ నింక అనుమాన ప్రయాస యేల.

ఇది పూర్వపక్ష సూత్రము. ఏనుఁగు ప్రత్యక్ష మగుచుండఁగా దాని ఘీంకారములచే ఏనుఁగు నూహించు ప్రయాసమును మనుష్యులు పొందనట్లే ఆత్మ విషయమునఁగూడ అనుమానప్రయాస మెందుకని భావము.

మూ. ఆత్మని లింగే ఏకమేవ దృఢత్వాత్ ప్రత్యవత్ప్రత్యయః. 3-2-11

సూ. చూడఁబడిన యాత్మయం దితర కారణ సామగ్రి యున్నపుడు ఒక యనుమానమందె స్థిరమగుటవలన ప్రత్యక్షమువలె నిశ్చయ జ్ఞానము కలుగును.

ఇది సిద్ధాంత సూత్రము. దూరమునకు నీరు ప్రత్యక్షమైనను పక్షులఁ బట్టి యిది నీరేకాని యెండమావులు కావు అని యనుమానింపఁబడి తద్విషయక జ్ఞానము నిశ్చితమగు చున్నదని భావము. నేను చిక్కితిని, బలిసితిని ఇత్యాది వ్యతిరేక జ్ఞానములగు శరీర ధర్మములచే తిరస్కరింప బడకుండ స్థిరజ్ఞానము కలుగఁజేయునని తెలియునది.

మూ. దేవదత్తో గచ్ఛతి యజ్ఞదత్తో గచ్ఛత్యుపచారాచ్ఛరీరే ప్రత్యయః. 3-2-12

సూ. దేవదత్తుడు వెళ్ళుచున్నాడు, యజ్ఞదత్తుడు వెళ్ళుచున్నాడు ఇత్యాది వ్యవహారములలో ఔపచారికమువల్ల శరీరమందు జ్ఞానము కలుగుచున్నది. ఆత్మకు చలనాదులు లేవుకాన యజ్ఞదత్తాది పదములకు శరీరమందు లాక్షణికార్థమని భావము.

మూ. సందిగ్ధస్తూపచారః. 3-2-13

సూ. ఆత్మయందు శరీరమందును 'నేను' అను జ్ఞానము కలుగుచు అందు ఏయర్థము ముఖ్యమో ఏది ఔపచారికమో అని సందేహము కలుగుచున్నది.

ఇది పూర్వపక్ష సూత్రము.

మూ. అహమితి ప్రత్యగాత్మని భావాత్ పరత్రాఽభావా దర్థాంతర ప్రత్యక్షః. 3-2-14

సూ. 'నేను' అను జ్ఞానము తన యాత్మయందె యుండుట వలనను ఇతరమగుచోట ఉండకపోవుట వలనను ఆత్మ ప్రత్యక్షము ముఖ్యమగుచున్నది.

నేను అను జ్ఞానము శరీరమందె ముఖ్య మన్నచో ఆజ్ఞానము బహిరింద్రియ జన్యము కావలసివచ్చును. అట్లగుటలేదు కాన 'నేను' అనఁగా ఆత్మయందె ముఖ్యార్థము చెప్పవలెనని భావము.

మూ. దేవదత్తో గచ్ఛతీ త్యుపచారా దభిమానా త్తావచ్ఛరీర ప్రత్యక్షోఽహంకారః. 3-2-15

సూ. దేవదత్తుఁడు వెళ్లుచున్నాడని శరీరాభిమానమందలి యుపచారమువలన శరీరమందు నేను అను జ్ఞానము ప్రత్యక్షమగుచున్నది.

ఈ జ్ఞానము వాస్తవము కాదని భావము.

మూ. సందిగ్ధ స్తూపచారః. 3-2-16

సూ. ఔపచారికార్థముగాఁగూడ సందేహము కలుగుచున్నది. నేను లావుగానున్నాను, నేను పొట్టివాఁడను ఇత్యాది వ్యవహారములలో నేను పదము శరీరమునందును, నేను దుఃఖిని నేను సుఖిని ఇత్యాదులందు ఆత్మార్థమందును నేను పదము ఉపచరింపఁబడుచు సందేహము కలిగించుచున్నదని యాక్షేపింపఁ బడుచున్నది.

**మూ.** నతు శరీరవిశేషాత్ యజ్ఞదత్త విష్ణుమిత్రయోః జ్ఞానం విషయః. 3-2-17

సూ. శరీర భేదమునుబట్టి యింద్రియములచే ఆ శరీర భిన్నత్వము ప్రత్యక్ష మగుచున్నది. అట్లే యజ్ఞదత్త విష్ణుమిత్రుల జ్ఞానము ఆత్మ ప్రత్యక్షమునకే విషయ మగుచున్నది. ఇంద్రియ ప్రత్యక్షమునకు విషయ మగుటలేదు.

జ్ఞానము సుఖదుఃఖాదులైన యాత్మ గుణములకు ఉపలక్షణము. జ్ఞాన సుఖాదులకు శరీరము మరియొకటి ఆధారముగ చెప్పుకొనవలెనని భావము.

మూ. అహమితి ముఖ్య యోగ్యాభ్యాం శబ్దవద్వ్యతిరేకా వ్యభిచారాద్విశేషసిద్ధే ర్నాగమికః. 3-2-18

సూ. నేను అను జ్ఞానమును ముఖ్య ప్రమాణసిద్ధ కారణముల ద్వారా తెలిసికొనదగినది అది శబ్దమువలె పృథివ్యాదులకంటె నియమితముగ వ్యావృత్తమై విశేషముగ సిద్ధించుటవలన ఆగమసిద్ధము కాదు.

పరిశేష న్యాయముచే అనుమాన గమ్యమగును కాన కేవలాగమ గమ్యము కాదని భావము.

మూ. సుఖదుఃఖ జ్ఞాన నిష్పత్త్య విశేషాదైకాత్మ్య. 3-2-19

సూ. సుఖము దుఃఖములు జ్ఞానము పుట్టుటలో భేదములు లేక పోవుటవలన ఆత్మ యొక్కటియె.

ఇది పూర్వపక్ష సూత్రము.

మూ. వ్యవస్థాతో నానా. 3-2-20

సూ. ప్రాణుల భిన్న భిన్న గుణాది వ్యవస్థను బట్టి ఆత్మలు అనేకము.

ఒకడు దరిద్రుడు ఒక ధనికుడు ఒకడు సుఖి ఒకడు దుఃఖి ఇత్యాదిగ ప్రాణులు అనేక విధములుగ నుండుటను బట్టి ఆత్మలు అనేక మని

భావము. జీవుడు ఘటమువలె అసర్వజ్ఞుడుకాన పరమాత్మ కంటె భిన్నుడు అను ననుమానముచే ఆత్మ నానాత్వమును తెలియ వలెను.

మూ. శాస్త్ర సామర్థ్యాచ్చ. 3-2-21

సూ. శాస్త్ర సామర్థ్యమువల్లను గూడ ఆత్మలు అనేకము.

'ద్వే బ్రహ్మణీ వేదితవ్యే' 'రెండు బ్రహ్మలు అనగా జీవాత్మ పరమాత్మలు తెలిసికొనఁదగినవి, ఇత్యాది శ్రుతులను బట్టియు ఆత్మలు అనేకమని భావము.

ఇది శ్రీ కణాది మహర్షిచే రచింపఁబడి చర్ల వెంకమాంబా
నారాయణ శాస్త్రిల తనయుఁ డగు
గణపతిశాస్త్రిచే అనువదింపఁ బడిన
వైశేషిక మీమాంసా దర్శనమున
మూడవ యధ్యాయమున
రెండవ యాహ్నికము.

---

# నాల్గవ యధ్యాయమున మొదటి అహ్నికము.

మూ. సదకారణ వన్నిత్యం. 4-1-1

సూ. సత్తగలది కారణములేనిది నిత్యము.

పరమాణువులు నిత్యములు. వానికంటె నితరమగు ఘటాదులు కారణసహితముకాన అనిత్యము లని భావము.

మూ. తస్య కార్యం లింగం. 4-1-2

నిత్యములగు పరమాణువులకు కార్యములగు ఘటాదులు సూచకములు.

మూ. కారణభావా త్కార్యభావః. 4-1-3

సూ. రూపాది గుణములు కారణములగు పరమాణువులం దుండుటవల్ల కార్యములగు ఘటాదులందుండును.

ఈ పరమాణువులె ద్వ్యణుకాది క్రమమున సృష్టికి కారణమని వైశేషికాదు లందురు. ఈ పరమాణువులందు అనేక విశేషగుణము లుండును. అవే కార్యమగు ఈ సృష్టి కార్యములందు ఉండునని తెలియునది.

మూ. అనిత్య ఇతి విశేషతః ప్రతిషేధభావః. 4-1-4

సూ. అనిత్యము అని విశేషించి చెప్పుటను బట్టి అది నిత్యమునకు ప్రతిషేధ రూపమైనది.

అనిత్యమునకు నిత్యము, నిత్యమునకు అనిత్యము. ప్రతిషేధ రూపములు. నిత్యము లుండనిచో అనిత్యములుండవని భావము.

మూ. అవిద్యా. 4-1-5

సూ. సృష్టి కార్యము లనిత్యమనునట్లు పరమాణువు లనిత్య మనుట అజ్ఞానము.

మూ. మహత్యనేక ద్రవ్యవత్త్వా ద్రూపాచ్చోపలబ్ధిః. 4-1-6

సూ. మహత్పదార్థమునందు అనేక ద్రవ్యము లుండుటవల్లను రూపముండుటవల్లను ఉపలబ్ధ మగుచున్నది.

పరమాణువు మహత్పదార్థమును విడగొట్టఁగా విడఁగొట్టఁగా ఇంక విడఁగొట్ట శక్యముకానిది. అది సూక్ష్మముకనుక అది కంటికి గోచరముకాదు. మహత్పదార్థము పెద్దదిగాన కనిపించుననని భావము.

మూ. సత్యపి ద్రవ్యత్వే మహత్త్వే రూప సంస్కారాభావాత్ వాయో రనుపలబ్ధిః. 4-1-7

సూ. వాయువు ద్రవ్యమైనను మహత్పదార్థమైనను రూపసంస్కారము లేకపోవుటవల్లఁ గనిపించుటలేదు

మూ. అనేక ద్రవ్య సమవాయాత్ రూపవిశేషాచ్చ రూపోపలబ్ధిః. 4-1-8

సూ. అనేక ద్రవ్యములందు సముదాయముగ నుండుటవల్లను రూపవిశేషము లుండుటవల్లను రూపము కనిపించుచున్నది.

రూపవిశేషమనఁగా రూపము పైకి కనిపించుచు అది ప్రకటముగా నుండఁజేయు (దానికంటె పెద్దవస్తువులు) ప్రతిబంధకములు లేకుండుట.

మూ. తేన రసగంధస్పర్శేషు జ్ఞానం వ్యాఖ్యాతం. 4-1-9

సూ. రూప ప్రత్యక్షజ్ఞానమువలెనే రసగంధ స్పర్శములందలి జ్ఞానమునని తెలియఁదగు.

రూపమువలెనే జలాది పరమాణువులందు రసాదులును ఉద్భూతములుగ నుండకపోవుటచే రసాదిజ్ఞానము కలుగుట లేదని భావము.

మూ. తస్యాభావా దవ్యభిచారః 4-1-10

సూ. గురుత్వమందు రూపాదులు లేకపోవుటవలన గురుత్వము కనిపింప దేమియను వ్యభిచార దోషములేదు,

రూపమున్న వస్తువులందు గురుత్వమును ఉండునుకాని గురుత్వములో రూపము లేకపోవుటలేదు కాన దోషములేదని భావము.

మూ. సంఖ్యాః పరిమాణాని, పృథక్త్వం సంయోగ విభాగౌ పరత్వా పరత్వే కర్మచ రూపద్రవ్య సమవాయాచ్చాక్షుషాణి. 4–1–11

సూ. సంఖ్యలు పరిమాణములు పృథక్త్వము సంయోగ విభాగములు పరత్వా పరత్వములు కర్మ ఇవి రూపముగల ద్రవ్యములందు సమవాయ సంబంధముతో నుండుటవల్ల కంటికిఁ గనిపించునవి.

చాక్షుషజ్ఞానము అనునది స్పర్శజ్ఞానమున కుపలక్షణము.

మూ. అ రూపి ష్వచాక్షుషాణి. 4–1–12

సూ. రూపములేని ద్రవ్యములందున్న సంఖ్యాదులు చాక్షుష జ్ఞాన గోచరములు కావు.

మూ. ఏతేన గుణత్వేభావేచ సర్వేంద్రియజ్ఞానం వ్యాఖ్యాతం. 4–1–13

సూ. ఇట్లు చెప్పుటచే గుణత్వమందును ఉనికియందును సర్వేంద్రియ గ్రాహ్యత్వ జ్ఞానముండునని చెప్పినట్లే.

ఇది

శ్రీ కణాద మహర్షిచే రచింపఁబడి,

చర్ల వెంకమాంబా నారాయణశాస్త్రిల

తనయుఁడగు గణపతిశాస్త్రిచే తెనిఁగింపఁబడిన

వైశేషిక మీమాంసా దర్శనమున

నాల్గవ యధ్యాయమున

మొదటి యాహ్నికము.

---

# నాల్గవ యధ్యాయములో రెండవ అహ్నికము.

మూ. తత్పునః పృధివ్యాది కార్యద్రవ్యం త్రివిధం శరీరేం ద్రియ విషయ సంజ్ఞకం. 4-2-1

సూ. భూమి మొదలగు కార్యద్రవ్యములు మరల శరీరము ఇంద్రియములు విషయములు అని మూడు విధములు.

సకల ప్రాణుల శరీరము పృధివికి సంబంధించిన శరీరము. దాని గంధముద్వారా గ్రహించు ఇంద్రియము ముక్కు చివరిభాగము. మట్టిరాళ్లు మొదలగునవి విషయము జలము శరీరము. దాని రసమును గ్రహించు నాలుక ఇంద్రియము. సముద్ర మేఘ నదీ తటాకాదులు విషయము. తేజోమండల ప్రకాశరూపము. దానిని శరీరము గ్రహించు నింద్రియము. కంటిలోని నల్లగ్రుడ్డు భాగము. విషయము. భూమియందలి అగ్ని సూర్యమండలాదుల యగ్ని, అన్నమును జీర్ణింపజేయు జఠరాగ్ని, గనులందలి స్వర్ణరజతాదులు. వాయుమండల జీవులు శరీరము. దాని గ్రహించునది ప్రాణుల దేహమంతట నున్న చర్మము ఇంద్రియము. ప్రాణాది వాయువులు విషయము. అవకాశము ఆకాశము శరీరము, చెవి రంధ్రభాగము ఇంద్రియము. బాహ్యమైన ప్రదేశము విషయము.

మూ. ప్రత్యక్షా ప్రత్యక్షాణాం సంయోగస్యాఽప్రత్యక్షత్వాత్ పంచాత్మకం నవిద్యతే. 4-2-2

సూ. ప్రత్యక్షములు అప్రత్యక్షములు నగు పృధివ్యాదుల సంయోగము ప్రత్యక్షము కాకపోవుటవల్ల పైకి పంచాత్మకముగ కన్పించుటలేదు.

మూ. గుణాంతరాఽప్రాదుర్భావాచ్చ నత్ర్యాత్మకం. 4-2-3

సూ. పృధివ్యప్తేజో గుణములకంటె నితరగుణములు పృధివ్యప్తేజస్సులవల్ల పుట్టకపోవుటవల్ల శరీర మీ భూతత్రితయాత్మకమెకాదు.

శరీరమున ఇతర ద్రవ్యముల గుణములు కూడ కనిపించుచున్నవి. అది భూతత్రిత యాత్మకము కాక పంచభూతాత్మక మని భావము.

మూ. అణు సంయోగ స్త్వప్రతిషిద్ధః. 4-2-4

పంచభూతముల యణు సంయోగము పరస్పరపోషకమె కనుక అది నిషేధింపబడదు.

మూ. తత్ర శరీరం ద్వివిధం యోనిజ మయోనిజంచ. 4-2-5

సూ. అందు శరీరము యోనిజము అయోనిజమునని ద్వివిధము. యోనిజము జరాయు (మావి) జములు అండజములు అని రెండు విధములు. జరాయుజములు మనుష్య పశుజాతులు. అండజములు=పక్షులు సర్పములు మొ. అయోనిజములు ఉద్భిజ్జములు (భూమిని పెల్లగించుకొని వచ్చునవి) వృక్షాదులు స్వేదములు=చెమట నుండి పుట్టు దోమలు మొదలగునవి. అయోనిజులు ముని దేవాదులు గలరు. వారు అయోనిజులు.

మూ. అనియత దిగ్దేశ పూర్వకత్వాత్. 4-2-6

సూ. అయోనిజములు నియతమైన దిగ్దేశములు పూర్వములుగా గలవి కావు కాన అట్టి శరీరములు కలవు.

మూ. ధర్మ విశేషాచ్చ. 4-2-7

సూ. ధర్మవిశేష ముండుటవల్లను ఆత్మసంయోగమువల్ల ముని దేవాదులు అయోనిజులు.

మూ. సమాఖ్యా భావాచ. 4-2-8

సూ. వేదాదులందు చెప్పఁబడుటవల్లను అయోనిజులు కలరు.

మూ. సంజ్ఞాయా అనాదిత్వాత్. 4-2-9

సూ. తత్తద్గుణ సహిత సూర్యాది సంజ్ఞాపదములు అనాదిగా వచ్చుచుండుటచేత అయోనిజ శరీరము కలదని తెలియుచున్నది.

అగ్ని సూర్యుడు బ్రహ్మ మనువు మొదలగువారు అయోనిజులని భావము.

మూ. సంత్యయోనిజాః. 4-2-10

సూ. కాన అయోనిజులు కలరు.

మూ. వేదలింగాచ్చ. 4-2-11

సూ. వేద ప్రమాణమును బట్టియు అయోనిజులు కలరు.

పురుషసూక్తాది వేదప్రమాణములఁబట్టియు అయోనిజ శరీరములు గలవని భావము.

ఇది శ్రీ కణాది మహర్షిచే రచింపఁబడి చర్ల వెంకమాంబా
నారాయణ శాస్త్రిల తనయుఁడగు
గణపతిశాస్త్రిచే అనువదింపఁ బడిన
వైశేషిక మీమాంసా దర్శనమున
నాల్గవ యధ్యాయమున
రెండవ యాహ్నికము.

---

## అయిదవ యధ్యాయమున మొదటి ఆహ్నికము.

మూ. ఆత్మసంయోగప్రయత్నాభ్యాం హస్తేకర్మ. 5-1-1

సూ. జీవాత్మ యొక్క సంయోగముచేత ప్రయత్నము చేతను హస్తమందు కర్మ కలుగును.

మూ. తథా హస్తసంయోగాచ్చముసలే కర్మ. 5-1-2

సూ. అట్లే హస్త సంయోగమువలన రోకలియందు కర్మ కలుగును.

మూ. అభిఘాతజే ముసలాదౌ కర్మణి వ్యతిరేకా దకారణం హస్తసంయోగః. 5-1-3

సూ. తాకిడివల్ల పుట్టిన రోకలి మొదలగు వాని కర్మయందు ప్రయత్నమునకు వ్యభిచారము కలుగుటవలన హస్త సంయోగము రోకలియందలి కర్మకు కారణము కాదు.

రోకలి పైకెత్తి రోటియందు వేయఁగా రోటియందు తిరుగ హఠాత్తుగా పైకెగురుటకు హస్తసంయోగము కారణము కాదని భావము.

మూ. తథా ఆత్మసంయోగో హస్తకర్మణి 5-1-4

సూ. అట్లే హస్త కర్మయందు ఆత్మ సంయోగము కారణము కాదు.

మూ. అభిఘాతా న్ముసల సంయోగాద్ధస్తే కర్మ. 5-1-5

సూ. తాకిడివల్ల రోకలితో సంయోగము కలిగి యుండుటవల హస్తమందు కర్మ కలుగు చున్నది.

రోకలి రోటిలో పడి యెగురగా విధిలేక హస్తముకూడ ఎగురు చున్నదని భావము.

మూ. ఆత్మ కర్మ హ స్త సంయోగాచ్చ. 5-1-6

సూ. చేతికి రోకలికిగల సంయోగమును బట్టి శరీరావయవము లందును కర్మ కలుగుచున్నది.

మూ. సంయోగాభావే గురుత్వా త్పతనం. 5-1-7

సూ. ప్రతిబంధక సంయోగము లేనపుడు బరువుగా నుండుట వల్ల పతనము కలుగుచున్నది.

మూ. నోదన విశేషాభావా న్నోర్ధ్వం నతిర్య్యగ్గమనం. 5-1-8

సూ. పైకి బంతి విసరుటలో విశేషములు లేకపోవుటవల్ల పైకి గాని అడ్డముగా గాని గమనము కలుగుటలేదు.

మూ. ప్రయత్న విశేషా న్నోదన విశేషః. 5-1-9

సూ. ప్రయత్న విశేషమువలన పైకి ఎగురుటలో విశేషము కలుగుచున్నది.

మూ. నోదనవిశేషా దుదసన విశేషః. 5-1-10

సూ. పైకి విసరుటలోని విశేషమువలన పైకి వస్తువు చిమ్మబడుచున్నది.

మూ. హ స్తకర్మణా దారకకర్మ వ్యాఖ్యాత. 5-1-11

సూ. రోకలినిబట్టి కర్మవలెనె బాలుర కర్మ యుండును.

అట్టి బాలుర కర్మ హితాహిత ప్రాప్తి ఫలముగాని పుణ్య పాప హేతువుకాని కాదని భావము.

మూ. తథా దగ్ధస్య విస్ఫోటనే. 5-1-12

సూ. అట్లే తగుల బెట్టబడు వస్తువుల యొక్క పగులుట చీలుట మొదలగు కర్మయందును తెలియునది.

మూ. యత్నాభావే ప్రసు ప్తస్య చలనం. 5-1-13

సూ. నిద్రించువాని యొక్క చలనము వాని యత్నము లేకున్నను ప్రాణవాయు సంయోగమువలనఁ గలుగును.

మూ. తృణే కర్మ వాయుసంయోగాత్. 5-1-14

సూ. వాయు సంయోగమువలన తృణ వృక్షాదులందు కర్మ కలుగును.

మూ. మణిగమనం సూచ్యభిసర్పణ మదృష్టకారణం. 5-1-15

సూ. మంత్రాదికమువలన మణులు కదలుటలోను సూదంటు రాతినిబట్టి సూది కదులుటలోను కారణములు పైకి కనిపించునవి కావు.

ఇట్లే అగ్నికి ఊర్ధ్వజ్వలనము గాలికి తిర్యగ్గమనము సృష్ట్యాదిని పరమాణువుల కర్మలలోను కారణములు పైకి కనిపింపవని భావము.

మూ. ఇషావయుగప త్సంయోగ విశేషాః కర్మాన్యత్వే హేతుః 5-5-16

సూ. బాణమునందు ఒక్కమాటుగా కలుగని సంయోగ విశేషములు ఇతరకర్మలు కలుగుటలో హేతువులు.

ఏదైన ఒకదానిమీద బాణాదులు ప్రయోగింపగా అవి హృదయగత ప్రాణమును నాశనము చేయును. దానిని బట్టి అదివరలో చలించు హస్తాద్యవయవ చలనములు క్రమముగా తగ్గుటలోను అవయవములందు ఇతరకర్మలు కలుగుటలోను శరాది పతన సంయోగ విశేషములు కారణములని భావము.

మూ. నోదనాదాద్య మిషోః కర్మ, తత్కర్మ కారితాచ్చ సంస్కారా దుత్తరం; తథోత్త ముత్తరంచ. 5-1-17

సూ. పైకి విసరుటవల్ల మొదట బాణకర్మయు ఆ బాణకర్మచే ప్రేరేపింపబడిన సంస్కారమువలన ఉత్తర కర్మయును అట్లే ఇంక ఉత్తరోత్తర కర్మలును కలుగును.

మూ. సంస్కారాభావే గురుత్వాత్పతనం. 5-1-18

సూ. ఆసంస్కారము లేనపుడు బరువువల్ల పతనము కలుగుచున్నది.

ఇది

శ్రీ కణాద మహర్షిచే రచింపఁబడి,
చర్ల వెంకమాంబా నారాయణశాస్త్రుల
తనయుఁడగు గణపతిశాస్త్రిచే తెనిఁగింపఁబడిన
వైశేషిక మీమాంసా దర్శనమున
అయిదవ యధ్యాయమున
మొదటి యాహ్నికము.



## అయిదవ యధ్యాయమున రెండవ యాహ్నికము

మూ. నోదనాభిఘాతాత్ సంయుక్త సంయోగాచ్చ పృధివ్యాం కర్మ. 5-2-1

సూ. విసరుటచేఁ గలిగిన తాకిడివల్లను కలసినదాని కలయికవల్లను భూమియందు కర్మ కలుగుచున్నది. భూమిపైని విసరిన పెద్ద ఱాతి తాకిడివల్ల భూమి అదిరి దానితోఁ గలసియున్న ఘటమును దాని కలయిక వల్ల నీరు నూనె మొదలగు వాటియందు కర్మ కలుగుచున్నది.

మూ. తద్విశేషేణాఽదృష్ట కారితం. 5-2-2

సూ. ఆభూమి యింక విశేషముగా గదలినచో అది యదృష్ట (పైకి కనిపించని) కారణముచేఁ గలిగిన దన్నమాట.

మూ. అపాం సంయోగాభావే గురుత్వాత్పతనం. 5-2-3

సూ. నీటి కాధారమగు మేఘాదుల సంయోగము లేనపుడు బరువుగా నుండుటవల్ల వర్షపునీరు పడుచున్నది.

మూ. ద్రవత్వాత్ స్యందనము. 5-2-3

సూ. నీరు ద్రవముగా నుండుటవల్ల జారుచున్నది.

మూ. ఉత్తరనాడ్యా వాయు సంయోగా దారోహణం. 5-2-4

సూ. పై సూర్యకిరణముల వాయు సంయోగము వలన నీటిని పైకి తీసికొని పోవుచున్నది. 5-2-5

మూ. నోదనా పీడనా త్సంయుక్త సంయోగాచ్చ. 5-2-6

సూ. వాయువుచే ప్రేరేపింపఁబడి పైకి తీసికొని పోబడుటవల్లను వాయువుతో గలసిన సూర్యరశ్మితో కలసినవగుట వల్లను నీళ్లు పైకి పోవుచున్నవి.

మూ. వృక్షాభి సర్పణమిత్య దృష్టకారితం 5-2-7

సూ. చెట్ల మొదటి నీరు పత్రఫల పుష్ప శాఖాభివృద్ధిని గలిగించుటలో అదృష్ట కారణమగును.

మూ. అపాంసంఘాతో విలయనంచ తేజస్సంయోగాత్. 5-2-8

సూ. తేజస్సంయోగ విశేషముండుటచే నీరు వడగండ్లవలె ముద్ద కట్టి తిరిగి కరగిపోవుచుండును.

మూ. తత్ర విస్ఫూర్జ థుర్లింగం. 5-2-9

సూ. అందు ఉఱుము సూచకము.

మూ. వైదికం చ. 5-2-10

సూ. నీటికి తేజస్సంయోగముండుననుటకు వైదిక ప్రమాణము గలదు.

"ఆపస్తా అగ్నిం గర్భమాధీరన్ యా అగ్నిం దధిరే సువర్ణం" ఏ నీళ్లు మంచిరంగుగల యగ్నిని ధరించెనో ఆ నీళ్లు అగ్నిని గర్భమున ధరించినవి. ఇత్యాదులు వేద ప్రమాణములు.

మూ. అపాం సంయోగాత్ విభాగాచ్చ స్తనయిత్నోః.
5-2-11

సూ. తేజస్సుతో జలముల సంయోగ విభాగముల వలన ఉఱుము జనించుచున్నది.

మూ. పృథివీ కర్మణా తేజః కర్మ వాయు కర్మచ వ్యాఖ్యాతం.
5-2-12

సూ. భూమి కర్మచే తేజః కర్మయును వాయు కర్మయును వ్యాఖ్యానించఁబడినవి.

భూమికర్మ వంటివె తేజో వాయు కర్మలని భావము.

మూ. అగ్నేరూర్ధ్వజ్వలనం, వాయోస్తిర్యక్పవనం.
అణూనాం మనసశ్చాద్యం కర్మాదృష్ట కారితం. 5-2-13

సూ. అగ్నికి పైకి మండుట, గాలికి అడ్డముగా వీచుట, అణు మనస్సుల మొదటి కర్మయును అదృష్టకారణముచే గలిగినవి.

మూ. హస్త కర్మణా మనసః కర్మ వ్యాఖ్యాతం. 5-2-14

సూ. హస్తకర్మచే మానసిక కర్మయు వ్యాఖ్యానింపఁబడినది.

మూ. ఆత్మేంద్రియ మనోఽర్థ సన్నికర్షాత్ సుఖదుఃఖే. 5-2-15

సూ. ఆత్మకు ఇంద్రియ మనో విషయముల సంబంధము వల్ల సుఖదుఃఖములు కలుగుచున్నవి.

మూ. తదనారంభ ఆత్మస్థే మనసి, శరీరస్య దుఃఖాభావః స యోగః. 5-2-16

సూ. మనస్సు ఆత్మయందు లీనమైనపుడు శరీరమునకు దుఃఖము కలుగుట లేదు. అదే యోగము.

మూ. అపసర్పణ ముపసర్పణ మశిత పీతసంయోగాః కార్యాంతరసంయోగాశ్చేత్య దృష్టకారితాః. 5-2-17

సూ. ప్రాణ మనస్సులు జీవుని విడచుట, జీవునిలో ప్రవేశించుట భుజించుట త్రాగుట మొదలగు సంయోగములును ఇతర కార్యములతో వానికి సంయోగములును అదృష్టకారణము లచే చేయబడినవె.

మూ. తదభావే సంయోగాభావోఽప్రాదుర్భావశ్చ మోక్షః 5-2-18

సూ. ప్రాణ మనస్సులు జీవుని విడచుట మొదలగునవి లేకపోవుటయు తిరిగి జన్మ లేకపోవుటయు మోక్షము.

మూ. ద్రవ్యగుణకర్మ నిష్పత్తి వైధర్మ్యాత్ భాఽభావ స్తమః. 5-2-19

సూ. ద్రవ్యగుణ కర్మలందు నిష్పత్తిరూప సాధర్మ్యము లేకపోవుటవలన చీకటి అభావరూపమైనది.

ద్రవ్యాదులందు ఒకదాని నుండి మొకటి పుట్టుట అను ధర్మము కలదుగాని చీకటిలో అట్టి ధర్మము లేదు. అది ద్రవ్యాదులలో ఏదియును కాదు కాన అది వెలుగునకు అభావరూపమైనది. ఇందుచే ద్రవ్యములు

తొమ్మిదే కాని పదికావు. పృథివ్యాదు లన్నియు భావరూపములు, ఇది అభావరూపమైనది.

మూ. తేజసో ద్రవ్యాంతరేణావరణాచ్చ. 5-2-20

సూ. ఇతర ద్రవ్యముచేత క్రమముగా తేజస్సు ఆవరింపఁ బడుట వలన గమన మున్నట్లు కన్పించుచున్నదే కాని చీకటిలో గమనములేదు. కదలుచున్న ద్రవ్యములచే తేజస్సు ఆవరింపఁబడి ఆ యావరింప బడిన దేశములు తేజస్సు లేకపోవుటచే చీకటిగా కనిపించుచున్నవి. ఆవరింపఁ బడనిచోట తేజస్సే కనిపించుచున్నది. సూర్యతేజస్సునకు భూభ్రమణ ములో భూభాగము అడ్డుపడి చీకటి కలుగుచున్నది. ఇట్లే దీపప్రకా శములును అని తెలియునది.

మూ. దిక్కాలావకాశంచ క్రియావద్వైధర్మ్యా న్నిష్క్రియాణి. 5-2-21

సూ. దిక్కులు కాలము ఆకాశములకు క్రియలు గలవానితో వైధర్మ్య ముండుటవలన అవి క్రియలు కలవికావు.

ఆకాశమును అని సముచ్చయముచే ఆత్మనుగూడ గ్రహింప వలెను. దిగాదులు క్రియ కలవానిలో అమూర్తత్వము వైధర్మ్యము. పృథివ్యాదులు మూర్తి కలవి. దిగాదులు మూర్తి లేనివి.

మూ. ఏతేన కర్మాణి గుణాశ్చ వ్యాఖ్యాతాః. 5-2-22

సూ. కర్మలును గుణములును దిగాదులవంటివిగాన దీనిచే అవి వ్యాఖ్యానింపఁ బడెను (క్రియలు గలవి కావని భావము)

మూ. నిష్క్రియాణాం సమవాయః కర్మభ్యో నిషిద్ధః. 5-2-23

సూ. క్రియలు లేనివానికి ద్రవ్యముతోఁ గల సమవాయ సంబంధము కర్మల నుండి నిషేధింపఁ బడినది.

క్రియలులేని గుణకర్మలు కర్మల నుండి కలుగవని భావము.

మూ. కారణం త్వసమవాయినో గుణాః. 5-2-24

సూ. గుణములె అసమవాయి కారణములగును.

తంత్వాదులందున్న శ్వేతాది గుణములు వస్త్రములందలి శ్వేతాది గుణములకు అసమవాయి కారణములగునని భావము.

మూ. గుణేన దిక్ వ్యాఖ్యాతా. 5-2-25

సూ. గుణములకువలె దిక్కులకును అని తెలియునది.

మూ. కారణేన కాలః. 5-2-26

సూ. కాలము కర్మలకు నిమిత్తకారణ మగుటచే సమవాయి కారణము కాదు.

ఇది శ్రీ కణాది మహర్షిచే రచించబడి చర్ల వెంకమాంబా
నారాయణ శాస్త్రిల తనయుఁ డగు
గణపతిశాస్త్రిచే అనువదింపఁ బడిన
వైశేషిక మీమాంసా దర్శనమున
అయిదవ యధ్యాయమున
రెండవ ఆహ్నికము.

---

## అరవ యధ్యాయము మొదటి అహ్నికము.

మూ. బుద్ధిపూర్వా వాక్యకృతిర్వేదే 6-1-1

సూ. వేదమున వాక్యరచన యథార్థ జ్ఞానపూర్వకమైనది.

మూ. బ్రాహ్మణే సంజ్ఞాకర్మ సిద్ధి లింగం. 6-1-2

సూ. వేద వాక్య రచన యథార్థ జ్ఞాన పూర్వకమైన దనుటకు వేదభాగమగు బ్రాహ్మణమందలి సంజ్ఞలు కర్మలు సిద్ధించుట కారణము.

మూ. బుద్ధిపూర్వో దదాతిః. 6-1-3

సూ. అందు చెప్పబడిన దాన కర్మయు జ్ఞానపూర్వకమైనది.

మూ. తథా ప్రతి గ్రహః. 6-1-4

సూ. అట్లే ప్రతిగ్రిహ విధియు జ్ఞాన పూర్వకము.

మూ. ఆత్మాంతర గుణానామాత్మాంతరేఽకారణత్వాత్. 6-1-5

సూ. ఒక జీవాత్మయందలి ధర్మాధర్మాది గుణములు ఫలించుటలో ఇతర జీవాత్మలయందు కారణములు కావు కనక దాని ప్రతిగ్రిహములు జ్ఞానపూర్వకములు.

మూ. తద్దుష్ట భోజనే న విద్యతే. 6-1-6

సూ. దానాది ఫలము దుష్టులకు భోజనము పెట్టినప్పుడు కలుగదు.

మూ. దుష్టం హింసాయాం. 6-1-7

సూ. హింసలో ప్రవర్తించుట దుష్టము.

మూ. తస్య సమభి వ్యాహారతో దోషః. 6-1-8

సూ. ఆ దుష్టుని సంపర్కము వల్ల దోషము కలుగును.

మూ. తదదుష్టే నవిద్యతే. 6-1-9

సూ. దుష్టుడు గానిచో ఆ సంపర్కమున దోషము ఉండదు.

మూ. పునర్విశిష్టే ప్రవృత్తిః. 6 1-10

సూ. విశిష్టునియందైతే దానాది ప్రవృత్తి చేయవలెను.

మూ. సమే హీనేవా ప్రవృత్తిః. 6-1-11

సూ. తనతో సమునియందుగాని తక్కువ వానియందుగాని దానాది ప్రవృత్తి చేయవచ్చును.

మూ. ఏతేన హీన సమ విశిష్ట ధార్మికేభ్యః పరస్వాదానం వ్యాఖ్యాతం. 6-1-12

సూ. దీనిచే తక్కువ వారు సములు విశిష్ట ధార్మికులనుండి ఇతర ధనమును గ్రహించుటయును వ్యాఖ్యానింపబడినది.

మూ. తథా విరుద్ధానాం పరిత్యాగః. 6-1-13

సూ. ధర్మ విరుద్ధ ధనములను త్యజింపవలెను.

మూ. హీనే పరే త్యాగః 6-1-14

సూ. హీనుడైన శత్రువు విషయమున ఈ దాన ప్రతి గ్రహములు త్యజింపవలెను.

మూ. సమ ఆత్మత్యాగః పరత్యాగో వా. 6-1-15

సూ. తనకు సముని విషయమై ఆత్మత్యాగము పరత్యాగముగాని చేయవలెను.

మూ. విశిష్ట ఆత్మత్యాగః. 6-1-16

సూ. తన్ను త్యజించుట విశిష్టమైనది.

ఇది శ్రీ కణాది మహర్షిచే రచింపబడి చర్ల వెంకమాంబా
నారాయణ శాస్త్రిల తనయుండగు
గణపతిశాస్త్రిచే అనువదింపబడిన
వైశేషిక మీమాంసా దర్శనమున
ఆరవ యధ్యాయమున
మొదటి ఆహ్నికము.

---

## అరవ యధ్యాయమున రెండవ ఆహ్నికము

మూ. దృష్టా దృష్ట ప్రయోజనానాం దృష్టాభావే ప్రయోజన మభ్యుదయాయ. 6-2-1

సూ. దృష్టా దృష్ట ప్రయోజనము గల కర్మలకు దృష్ట ప్రయోజనము లేనపుడు ప్రయోజనము అభ్యుదయ కొఱకు అగును.

మూ. అభిషేచనోపవాస బ్రహ్మచర్య గురుకులవాస వానప్రస్థ యజ్ఞదాన ప్రోక్షణ దిఙ్నక్షత్ర మంత్రకాల నియమా శ్చాదృష్టాయ. 6-2-2

సూ. స్నానము ఉపవాసము బ్రహ్మచర్యము గురుకులవాసము వానప్రస్థము యజ్ఞము దానము జలప్రోక్షణము దిక్కులు నక్షత్రములు మంత్రములు కాలము శౌచ తపస్స్వాధ్యాయాది నియమములు అదృష్ట ఫలముకొఱకగును.

మూ. చాతురాశ్రమ్య ముపధాః అనుపధాః. 6-2-3

సూ. వర్ణాశ్రమధర్మములు ఉపధలు, అనుపధలు అదృష్ట ప్రయోజనము గలవి.

మూ. భావదోష ఉపధా అదోషోఽనుపధా. 6-2-4

సూ. ప్రమాదాది భావదోషములు ఉపధలు శ్రద్ధాది భావగుణములు అనుపధలు.

ప్రమాదము అశ్రద్ధ మదము మానము అసూయ అశుచి మొదలగునవి భావ దోషములు. శ్రద్ధ మనోనైర్మల్యము జ్ఞానము కర్మనిశ్చయము శుచి మొదలగునవి భావగుణములు.

మూ. యదిష్ట రూప రస గంధ స్పర్శం ప్రోక్షిత మభ్యుక్షితంచ తచ్ఛుచి. 6-2-5

సూ. ఇష్టములగు రూప రస గంధ స్పర్శలును మంత్రోదక ప్రోక్షణ జలాభిషేకములును శుచి యనబడును.

మూ. అశుచీతి శుచి ప్రతిషేధః. 6-2-6

సూ. శుచికంటె విపరీతమైనది అశుచి.

మూ. అర్థాంతరంచ. 6-2-7

సూ. ఇతరమైనదికూడ దోషయుక్తమైనచో అశుచియెయగును.

మూ. అయతస్య శుచి భోజనా దభ్యుదయో నవిద్యతే. నియమాభావాత్. 6-2-8

సూ. యమములు లేనివారికి వారిదగ్గర నియమములు లేకపోవుటచే శుచి భోజనమువలన అభ్యుదయము కలుగదు.

అహింస సత్యము అస్తేయము బ్రహ్మచర్యము అపరిగ్రహము అనునవి యమములు. శౌచము సంతోషము తపస్సు స్వాధ్యాయము ఈశ్వర ప్రణిధానము ఇవి నియమములు. ఈ నియమము లున్నను అహింసాది యమములు లేనిచో వారు కేవల శుచి భోజనమువల్ల పాత్రులు గారని భావము.

మూ. విద్యతేవాఽర్థాంతరత్వాత్ యమస్య. 6-2-9

సూ. యమమునకు ఇంకొక ప్రయోజనము ఉండుట వలన దానికి ఉండవచ్చును కూడ.

మూ. అసతిచాభావాత్. 6-2-10

శుచి భోజనము లేనప్పుడును అభ్యుదయము లేకపోవుటవలన యమములె ముఖ్యముకాదు.

శుచి భోజనమున్నప్పుడు అభ్యుదయము కలుగునని భావము.

మూ. సుఖాద్రాగః. 6-2-11

సూ. సుఖమువల్ల రాగము పుట్టును.

ఇది ద్వేషమునకు ఉపలక్షణము.

మూ. తన్మయత్వాచ్చ. 6-2-12

సూ. సుఖములో తన్మయత్వము పొందుటవలనను రాగము పుట్టును.

మూ. అదృష్టాచ్చ. 6_2_13

సూ. అదృష్ట కారణమగు సంస్కారము వలనను రాగము కలుగును.

మూ జాతి విశేషాచ్చ. 6_2_14

సూ. జాతివిశేషములను బట్టియు రాగములు కలుగును.

మనుజులకు అన్నాదులందు రాగము, తృణాదులందు ద్వేషము. మృగములకు తృణాదులందు రాగము, మాంసాదులందు ద్వేషము. మూషికాదులకు మార్జాలాదులందు ద్వేషము. ముంగిసలు మొదలగు వానికి సర్పాదులందు ద్వేషము. ఇట్లే మిగిలినవి తెలియునది.

మూ. ఇచ్ఛాద్వేష పూర్వికా ధర్మాధర్మప్రవృత్తిః 6_2_15

సూ. ధర్మాధర్మ ప్రవృత్తి యిచ్ఛాద్వేష పూర్వకమైనది.

మూ. తత్సంయోగో విభాగః. 6_2_16

సూ. ధర్మాధర్మ సంయోగమె జన్మము, ధర్మాధర్మముల విభాగమె మరణము.

మూ. ఆత్మకర్మసు మోక్షో వ్యాఖ్యాతః. 6_2_17

సూ. ఆత్మకర్మలున్నపుడు మోక్షము కలుగునని వ్యాఖ్యానింపఁబడినది.

శ్రవణ మననయోగాభ్యాస నిధిధ్యాసనాసన ప్రాణాయామ శమదమ సంపదలు ఆత్మకర్మలని తెలియునది.

ఇది శ్రీ కణాది మహర్షిచే రచింపఁబడి చర్ల వెంకమాంబా
నారాయణ శాస్త్రిల తనయుఁ డగు
గణపతిశాస్త్రిచే అనువదింపఁ బడిన
వైశేషిక మీమాంసా దర్శనమున
ఆరవ యధ్యాయమున
రెండవ ఆహ్నికము.

## ఏడవ యధ్యాయములో మొదటి అహ్నికము

మూ. ఉక్తా గుణాః. 7-1-1

సూ. గుణములఁ గూర్చి చెప్పఁబడినది.

మూ. పృథివ్యాది రూపరసగంధ స్పర్శాః ద్రవ్యా నిత్యత్వా దనిత్యాశ్చ. 7-1-2

సూ. పృథివ్యాదులందున్న రూపరస గంధస్పర్శలు ద్రవ్యము లందు అనిత్యములై యుండుటచే అనిత్యములు.

మూ. ఏతేన నిత్యేషు నిత్యత్వ ముక్తం. 7-1-3

సూ. ఇందుచే నిత్యద్రవ్యము లందలి రూపములు నిత్యములె యని తెలియవలయు.

మూ. అప్సు తేజసి వాయౌచ నిత్యాః ద్రవ్య నిత్యత్వాత్. 7-1-4

సూ. నీళ్ళయందు తేజస్సునందు వాయువునందు గల రూపాదులు నిత్య ద్రవ్యములందున్నవి గాన నిత్యములె.

మూ. అనిత్యేషు అనిత్యా ద్రవ్యా నిత్యత్వాత్. 7-1-5

సూ. ద్రవ్యములు అనిత్యముగాన అనిత్యములం దున్నవి అనిత్యములె.

మూ. కారణ గుణపూర్వకాః పృథివ్యాం పాకజాః. 7-1-6

సూ. పృథివియందుఁ గార్యములుగ పరిణామము చెందిన రూపాదులు కారణ గుణములను బట్టి కలిగినవి.

నిత్యములగు పరమాణువులు ద్వ్యణుక త్ర్యణుకాది క్రమమున బ్రహ్మాండాంత పర్యంతము కార్యరూపముగ మార్పుచెంది ఘటాది రూపములను పొందుచున్నవి. అవి మూలకారణములగు పరమాణువులం దున్న గుణములను బట్టి కార్యములగు ఘటాదులందు అటువంటి గుణములు కలుగును. పీలువులు (అణువులు) స్వతంత్రముగా పండి

నశింపగా క్రొత్తరూపము పుట్టి కారణ గుణ క్రమముగా అవయవి యందు (ఘటాదికమందు) రూపము లుత్పన్నమగునందురు వీరిని పీలు పాక (అణుపాక) వాదు లందురు. అట్లుగాక పిఠరమె (సముదాయమె) పండఁగా ఘటాదులందు రూపము పుత్పన్న మగునని కొందరందురు. వీరిని పిఠరపాక వాదులందురు.

మూ. ఏకద్రవ్యత్వాత్. 7-1-7

సూ. పాకజములగు రూపాదులు తమ కాశ్రయమైన ద్రవ్య మందుమాత్రమే యుండుటవలనను కారణ గుణ పూర్వకములు.

మూ. అణో ర్మహతశ్చోపలబ్ధ్యనుపలబ్ధీ నిత్యే వ్యాఖ్యాతే. 7-1-8

సూ. నిత్య విషయములో అణువులు ప్రత్యక్షము కాకపోవుట లోను మహాపదార్థములు ప్రత్యక్షమగుటలోను ఉద్భూత రూపత్వము (పైకి రూపము కనిపించుట) లేకపోవుటయు ఉండుటయు కారణమని పూర్వము వ్యాఖ్యానింపబడినది.

మూ. కారణ బహుత్వాచ్చ. 7-1-9

సూ. అనేక కారణము లుండుటవలనను ద్వణుకాది పరిమాణ ముత్పన్న మగుచున్నది.

పరమాణువులందు సంయోగాది కారణములను బట్టి ద్వ్యణుక త్ర్యణుకాది పరిణామము లుత్పన్న మగుచున్నవని భావము.

మూ. అతో విపరీత మణు. 7-1-10

సూ. ఆ పరిమాణముకంటె విపరీతమైనది యణువు.

ద్వ్యణుకాది పరిమాణములకంటె భిన్నమైనది యణువని భావము.

మూ. అణు మహదితి తస్మిన్ విశేషభావాత్ విశేషాభావాచ్చ. 7-1-11

సూ. ఆ పరిమాణమునందు విశేషము లుండుటవల్ల మహత్తని విశేషము లేకపోవుటవల్లను అణువని వ్యవహారము కలుగుచున్నది.

మామిడికాయకంటె ఉసిరికకాయ అణువు. ఉసిరికాయకంటె ఆవగింజ అణువు ఇత్యాదివ్యవహారములు లాక్షణికములని భావము.

మూ. ఏక కాలత్వాత్. 7_1_12

సూ. ఆ పరిమాణమునందు అణుత్వ మహత్త్వ వ్యవహారములు ఏక కాలమందు అనుభవములోఁ జూడబడుటవల్ల గలుగుచున్నవి.

మూ. దృష్టాంతాచ్చ. 7_1_13

సూ. ఆ పరిమాణమందు దృష్టాంతమును బట్టియు అణుత్వ మహత్త్వ వ్యవహారములు గలుగుచున్నవి.

ఉసిరికకన్న మామిడికాయ మహత్తు; మామిడికాయకన్న ఉసిరికకాయ యణువు. ఇత్యాది దృష్టాంతములఁ బట్టి అణుత్వ మహత్త్వ వ్యవహారములు గలుగుచున్నవి.

మూ. అణుత్వ మహత్త్వయో రణుత్వ మహత్త్వాభావః కర్మ గుణై ర్వ్యాఖ్యాతః. 7_1_14

సూ. గుణకర్మలలో అణుత్వ మహత్త్వములు లేనట్లే అణుత్వ మహత్త్వములందు అణుత్వ మహత్త్వములు లేవు.

చిన్న పెద్ద వస్తువులను బట్టి ఒకదానికంటె ఒకటి పోలికలను బట్టి అణుత్వాది వ్యవహారము కనిపించుచున్నది కాని వాస్తవమునకు వానిలో అణుత్వాదులు లేవని భావము.

మూ. కర్మభిః కర్మాణి గుణైశ్చ గుణా వ్యాఖ్యాతాః. 7_1_15

సూ. కర్మచే కర్మలు, గుణములచే గుణములు పరిమాణావంతములు కావు.

ఒక చీలిక, పెద్ద చీలిక, పెద్ద శబ్దము, చిన్న శబ్దము, రెండు శబ్దములు, చిన్న పెద్ద రూపములు రెండు రూపములు ఇత్యాదులు వస్తువులను బట్టి కలుగుచున్న వేకాని వాస్తవమునకు వానికి పరిమాణములు లేవని భావము.

మూ. అణుత్వ మహత్త్వాభ్యాం కర్మ గుణాశ్చ. 7-1-16

సూ. అణుత్వ మహత్త్వములందువలెనే గుణకర్మలందును అణుత్వ మహత్త్వములు లేవు.

మూ. ఏతేన హ్రిస్వత్వ దీర్ఘ క్త్వే వ్యాఖ్యాతే. 7-1-17

సూ. దీనిచే హ్రిస్వత్వ దీర్ఘత్వ విషయములు వ్యాఖ్యానింపఁబడినవి.

మూ. అనిత్యే అనిత్యం. 7-1-18

సూ. ఘటాద్యనిత్య ద్రవ్యమునందు పరిమాణము అనిత్యము.

మూ. నిత్యే నిత్యం. 7-1-19

సూ. నిత్యమైన ద్రివ్యమందు పరిమాణము నిత్యము.

మూ. నిత్యం పరిమండలం. 7-1-20

సూ. పరమాణు పరిమాణము నిత్యము.

మూ. అవిద్యాచ విద్యాలింగం, 7-1-21

సూ. అవిద్యయును విద్యకు సూచకము.

వ్యావహారికమైన ఆమ్రి మలకాదులందలి యణుత్వ మహత్త్వ హ్రిస్వత్వ దీర్ఘత్వాది జ్ఞానము అవిద్య. దీనిని బట్టి పరమాణువులందలి నిత్యత్వ సత్యజ్ఞానము ఊహింపఁదగినది.

మూ విభవాన్మహా నాకాశ స్తథాచాత్మా. 7-1-22

సూ సర్వ వ్యాపకముకాన ఆకాశము మహత్తు అట్లే ఆత్మయును సర్వవ్యాపకముగాను మహత్తె.

మూ. తదభావా దణు మనః. 7-1-23

సూ. సర్వవ్యాపకము కాదు కనుక మనస్సు అణువు.

మూ. గుణైర్దిక్ వ్యాఖ్యాతా. 7-1-24

సూ. గుణములచే దిక్కును వ్యాఖ్యానింపఁబడినది. దిక్కులు నాలుగు పది అన్నది ఉపాధులను బట్టి కలిగినదని తెలియ వలయును.

మూ. కారణేన కాలః. 7-1-25

సూ. కారణముచేత కాలము వ్యాపకము.

ముందు వెనుక ఒకసారి పలుసార్లు శీఘ్రము చిరకాలము క్షణము ముహూర్తము దినము నెలలు సంవత్సరము యుగములు ఇత్యాది వ్యవహారములు సూర్యోదయాది వ్యవహారమును బట్టి గలిగినవె కాని అవి వాస్తవములుకావు కాన కాలము వ్యాపకము.

ఇది శ్రీ కణాది మహర్షిచే రచింపఁడి
చర్ల వెంకమాంబా నారాయణశాస్త్రిల
తనయుఁడగు గణపతిశాస్త్రిచే తెనిఁగింపఁబడిన
వైశేషిక మీమాంసా దర్శనమున
ఏడవ అధ్యాయమున
మొదటి ఆహ్నికము.

---

## ఏడవ యధ్యాయమున రెండవ ఆహ్నికము

అవతారిక—సంఖ్యాగుణము ఇప్పుడు పరీక్షింపఁబడు చున్నది.

మూ. రూపరసగంధ స్పర్శ వ్యతిరేకా దర్థాంతర మేకత్వం.
7-2-1

సూ. రూపరసగంధ స్పర్శలకంటె వేఱగుటవల్ల ఏకత్వము భిన్నమైనది.

రూపాదులు, సంఖ్య పరిమాణము పృథక్త్వము సంయోగ విభాగములకంటె భిన్నగుణముల కుపలక్షణము. ఘట మొక్కటి, పట మొకటి అనుచోట ఏకత్వము సత్తవలె సామాన్యము కాదు. అది విశేష జ్ఞానము.

7-2-2

మూ. తథా పృథక్త్వము.

సూ. అట్లే పృథక్త్వమును (భిన్నత్వమును)

ఇది దానికంటె వేఱు. ఇత్యాదులు ఉదాహరణము.

మూ. ఏకత్వైక పృథక్త్వయో రేకత్వైక పృథక్త్వా భావో
7-2-3
ఉణుత్వ మహత్త్వాభ్యాం వ్యాఖ్యాతః.

సూ. అణుత్వ మహత్త్వములందు వలెనే ఏకత్వైక పృథక్త్వము లందు ఏకత్వైక పృథక్త్వములు లేవు.

మూ. నిః సంఖ్యత్వా త్కర్మ గుణానాం సర్వైకత్వం నవిద్యతే.
7-2-4

సూ. సంఖ్య లేకపోవుటవల్ల గుణకర్మలకు అన్నిటికి ఏకత్వము ఉండదు.

ద్రివ్యములకే కాని గుణకర్మలకేకత్వాది వ్యవహారము లేదని భావము.

మూ. భ్రాంతం తత్. 7_2_5

సూ. గుణకర్మలందలి ఏకత్వజ్ఞానము భ్రాంతిమూలకము. అది లాక్షణిక మని భావము.

మూ. ఏకత్వాభావాద్భక్తిస్తు నవిద్యతే. 7_2_6

సూ. ద్రవ్యములందును ఏకత్వము భ్రాంతమన్నచో నింకెక్కడను ఏకత్వ ముండదుగాన నింక గౌణప్రయోగమె యుండదు.

మూ. కార్యకారణయో రేకత్వైక పృథక్త్వాభావా దేకత్వైక పృథక్త్వం నవిద్యతే. 7_2_7

సూ. కార్య కారణములందు ఏక పృథక్త్వములు లేకపోవుట వలన అందు ఏకత్వైక పృథక్త్వము లుండవు.

కార్యమును కారణమును ఒకటి గావు. లేక వేఱును కావు. దారముబట్టయు ఒకటికావు. దారముల గుంపు బట్ట యగు చుండుటచే వేఱును గావు అని భావము.

మూ. ఏత దనిత్యయో ర్వ్యాఖ్యాతం. 7_2_8

సూ. ఇది యనిత్య ద్రవ్యములందును పైదాని యట్లే యని తెలియవలెను.

మూ. అన్యతర కర్మజ ఉభయ కర్మజః సంయోగజశ్చ సంయోగః. 7_2_9

సూ. ఏదో యొకదాని కర్మవలన పుట్టినది, రెండిటి కర్మలవలన పుట్టినది, సంయోగమువలన పుట్టినది అని సంయోగము మూఁడు విధములు.

ఏదో యొకదానివల్ల పుట్టినదాని కుదా:_పరుగెత్తు చున్న పురుషుఁడు కదలకుండు పురుషుని వీపునకు తగులుట. రెండిటివల్ల పుట్టిన దాని కుదా:_పోరాడు నిద్దఱు మల్లుర సంయోగము. సంయోగజ సంయోగమున కుదా:_అంగుళితరు సంయోగమువల్ల హస్తతరు సంయోగము.

మూ. ఏతేన విభాగో వ్యాఖ్యాతః. 7_2_10

సూ. దీనిచే విభాగము వ్యాఖ్యానింపఁబడినట్లు.

మూ. సంయోగ విభాగయోః సంయోగ విభాగాభావ అణుత్వ మహత్త్వాభ్యాం వ్యాఖ్యాతః 7_2_11

సూ. అణుత్వ మహత్త్వములు అణుత్వ మహత్త్వములు గలవి కానట్లే సంయోగ విభాగములు గలవి కావు.

మూ కర్మభిః కర్మాణి గుణైశ్చ గుణాః అణుత్వ మహత్త్వాభ్యామితి. 7_2_12

సూ. అణుత్వ మహత్త్వముల చేతవలెనే కర్మలచే కర్మలు కర్మ కల్గినవియు గుణములచే గుణములు గుణములు కల్గినవియు కావు.

మూ. యుత సిద్ధ్యభావా త్కార్య కారణయోః సంయోగ విభాగా న విద్యేతే. 7_2_13

సూ. వేఱు వేఱు ఆశ్రియములం దుండక పోవుటవల్ల కార్య కారణములందు సంయోగ విభాగములు లేవు.

మట్టి కారణము, కుండ కార్యము, మట్టికి కుండకు వేఱు వేఱు ఆశ్రియములు లేవు. కాన మట్టికి కుండకు సంయోగము గాని విభాగము గాని యుండవని భావము.

మూ. గుణత్వాత్. 7_2_14

సూ. సంయోగము గుణమగుటవల్ల దానికి సంయోగ విభాగములు లేవు.

శబ్దము గుణముగాన దానితో నర్థమునకు సంయోగ సంబంధము లేదని భావము.

మూ. గుణోఽపి విభావ్యతే. 7_2_15

సూ. సంయోగమునకు వలెనె గుణమునకును సంయోగ విభాగములు లేవు.

మూ. నిష్క్రియత్వాత్, 7-2-16

సూ. గుణము క్రియలేనిదగుటవల్ల దానికి సంయోగ సంబంధము లేదు.

మూ. అసతి నాస్తీతిచ ప్రయోగాత్. 7-2-17

సూ. పదార్థము లేనపుడు లేదనియు ప్రయోగ ముండుట వలన శబ్దమునకు అర్థమునకు సంయోగ సంబంధము లేదు

ఇంటిలో ఘటము లేదు పటములేదు ఘటముండెను పటముండును. ఇత్యాది ప్రయోగములను బట్టి లేని ఘటాదులతో ఘటాద్యర్థములకు సంయోగ సంబంధముగాని సమవాయ సంబంధము గాని లేదని భావము.

మూ. శబ్దార్థావసంబంధౌ. 7-2-18

సూ. శబ్దార్థములందు సంయోగాది సంబంధములు లేవు

మూ. సంయోగినో దండాత్, సమవాయినో విశేషాచ్చ.
7-2-19

సూ. దండాదులనుబట్టి సంయోగజ్ఞానము గలవిగను, విశేషమునుబట్టియు సమవాయము కలవిగను నుండును.

దండ వంతుడు పురుషుడు అనుచోట దండ సంయోగము కలవాడు పురుషుడని జ్ఞానము కలుగుచున్నది. హస్తి కుంజరము అన్నచోట ఏనుగు హస్తము (తొండము) కలది అని యవయవమను సంబంధ విశేషమును బట్టి సమవాయ సంబంధము తోచుచున్నది. కాని యిటు ఘటశబ్దముగలది ఘటార్థముకలది అనుచో ఘట సంయోగ జ్ఞానము కలుగుట లేదు.

మూ. సామయికః శబ్దాదర్థ ప్రత్యయః. 7-2-20

సూ. పూర్వుల సంకేతమువల్ల శబ్దమునకు అర్థజ్ఞానము కలుగుచున్నది.

ఈ శబ్దమున కది యర్థము అను పూర్వుల సంకేతమువల్ల అట్టి యర్థము కలుగుచున్నది. కాని సంయోగాది సంబంధమువలనఁ గాదని భావము. ఆ యర్థజ్ఞానము వ్యవహారమువల్ల కలుగుచున్నదని భావము. దీనిని అభిధ యందురు. దీని వివరము నా సాహిత్య సౌందర్య దర్శనములో వృత్తి ప్రకరణమున చూడదగును.

మూ. ఏక దిక్కాభ్యా మేక కాలాభ్యాం సన్నికృష్ట విప్రకృష్టాభ్యాం పర మపరంచ. 7-2-21

సూ. సమీపదూరములైన యేక దిక్కు ఏకకాలముగల వానివల్ల పరత్వా పరత్వములు కలుగును.

సమీపమం దున్నదానియందు దిక్కుకు సంబంధించిన అపరత్వము దూరమందున్న దానియందు దిక్కుకు సంబంధించిన పరత్వము, కనిష్ఠునియందు కాలమునకు సంబంధించిన అపరత్వము, జ్యేష్ఠుని యందు కాలమునకు సంబంధించిన పరత్వము.

మూ. కారణ పరత్వాత్ కారణాపరత్వాచ్చ. 7-2-22

సూ. కారణమైన దిక్కాలములకు సంబంధించిన పరత్వాపరత్వముల బట్టి పరత్వాపరత్వ వ్యవహారములు కలుగును.

మూ. పరత్వా పరత్వయోః పరత్వా పరత్వా భావోఽణుత్వ మహత్త్వాభ్యాం వ్యాఖ్యాతః. 7-2-23

సూ. అణుత్వ మహత్త్వములకువలె పరత్వా పరత్వములకు పరత్వా పరత్వములు లేవు.

మూ కర్మభిః కర్మాణి గుణైశ్చ గుణాః. 7-2-24

సూ. కర్మలచే కర్మలును గుణములచే గుణములును తెలియవగు. గుణ కర్మలలో మరల గుణ కర్మ లుండవని భావము.

మూ. ఇహేదమితి యతః కార్యకారణయోః సమవాయః 7-2-25

సూ. ఇందులో నిది యున్నది అని యెందువలన కార్య కారణ సంబంధము కలుగునో అది సమవాయము.

దారములలో వస్త్రమున్నది మట్టిలో కుండ యున్నది కాన దారములు వస్త్రములకు, మట్టికుండకు సమవాయ కారణము. ఇక్కడ సంయోగాది సంబంధములు సంబంధింపవు.

మూ. ద్రవ్య గుణత్వ ప్రతిషేధో భావేన వ్యాఖ్యాతః. 7-2-26

సూ. సమవాయ సంబంధము భావ (సత్తా) రూప మగుటచే ద్రవ్యత్వ గుణత్వములకంటె భిన్నము.

సత్త యనునది యెట్లు ద్రవ్యాదులకంటె భిన్నమైనదో అట్లే సమవాయము నని భావము.

మూ. తత్త్వం భావేన. 7-2-27

సూ. ఏకత్వమును భావరూపమైనది.

ఇది శ్రీ కణాది మహర్షిచే రచింపఁబడి చర్ల వెంకమాంబా
నారాయణ శాస్త్రిల తనయుఁడగు
గణపతిశాస్త్రిచే అనువదింపఁబడిన
వైశేషిక మీమాంసా దర్శనమున
ఏడవ యధ్యాయమున
రెండవ యాహ్నికము.

## ఎనిమిదవ యధ్యాయమున రెండవ యాహ్నికము

మూ. ద్రవ్యేషు జ్ఞానం వ్యాఖ్యాతం. 8-1-1

సూ. ద్రవ్యములను గుఱించిన సందర్భములలో (3 అధ్యా) జ్ఞానము గూర్చి చెప్పఁబడినది.

మూ. తత్రాత్మా మనశ్చా ప్రత్యక్షే. 8-1-2

సూ. ద్రవ్యములలో ఆత్మయును మనస్సు ప్రత్యక్షము కానివి. దిక్కాలములును ప్రత్యక్షములు గావని తెలియునది.

మూ. జ్ఞాన నిర్దేశే జ్ఞాన నిష్పత్తి విధిరుక్తః. 8-1-3

సూ. జ్ఞానమును నిర్దేశించి చెప్పినపుడు జ్ఞాన నిష్పత్తి ప్రకారము చెప్పఁబడినది.

మూ. గుణకర్మసు సంనికృష్టేషు జ్ఞాన నిష్పత్తేః ద్రవ్యం కారణం. 8-1-4

సూ. గుణకర్మలు సంనికృష్టములుగా నున్నప్పుడు జ్ఞాననిష్పత్తికి ద్రవ్యము కారణము.

మూ. సామాన్యవిశేషేషు సామాన్య విశేషాభావాత్ తతఏవ జ్ఞానం. 8-1-5

సూ. సామాన్య విశేషములందు సామాన్య విశేషములు లేకపోవుటవలన దానివల్లనే జ్ఞానము కలుగును. సామాన్యమనఁగా సత్త. సత్త యందలి విశేషములు ద్రవ్యత్వ గుణత్వ కర్మత్వములు. వీటి యందు సామాన్య విశేష ములగు పృథివీత్వాది రూపత్వా ద్యుత్క్షేపణాదులు లేకపోవుటచే ఆద్రవ్యత్వాదుల నుండియె జ్ఞానము కలుగునని భావము. అనఁగా యోగ్యాశ్రయ విశేషముల నుండి ద్రవ్యగత సామాన్యములకును తన్నిబంధమగు సంయుక్త సమవాయము నుండి గుణకర్మ గతములకును యోగ్యాశ్రియ విశేషము నుండి తన్నిబంధనము గు సంయుక్త సమవేత సమవాయము నుండియు సమవేత సమ

వాయము నుండియు తదితర విషయములకును జ్ఞానము కలుగునని భావము. కంటికి ఘటముతో సంనికర్షము సంయోగము. కంటి సంయోగము గల ఘటమునందలి రూపముతో సంనికర్షము సంయుక్త సమవాయము. కంటిసంయోగము ఘటమునందు సమవాయ సంబంధముగా నున్న రూపములో నున్న రూపత్వముతో సంనికర్షము సంయుక్త సమవేత సమవాయము. చెవికి శబ్దముతో (గల) సంనికర్షము సమవాయము. గుణములకు గుణికి గల సంబంధము సమవాయము ఘటాభావము గలది భూతలము. అటుచోట సంనికర్షము విశేషణ విశేష్య భావరూపమైనది ఇత్యాద్యుదాహరణములు గ్రహించునది.

మూ॥ సామాన్యవిశేషాపేక్షం ద్రవ్యగుణకర్మసు. 8-1-6

సూ. ద్రవ్యగుణ కర్మలందలి జ్ఞానము సామాన్య విశేషముల నపేక్షించి కలుగును.

ద్రవ్య గుణకర్మలందు ద్రవ్యత్వ గుణత్వ కర్మత్వ విశిష్టబుద్ధి యున్నది. విశేష్య విశేషణేంద్రియ సంనికర్షవలన విశిష్ట జ్ఞానము కలుగుచున్నది. కాన సామాన్య విశేషాపేక్ష అందు ముఖ్యము. ఇది ద్రవ్యము ఇది గుణము ఇది కర్మ అను విశేషజ్ఞానము కలుగుచున్నదని భావము.

మూ. ద్రవ్యే ద్రవ్యగుణకర్మాపేక్షం. 8-1-7

సూ. ద్రవ్యమందు ద్రవ్యగుణ కర్మల నపేక్షించి జ్ఞానము కలుగును.

గంటలు కట్టిన తెల్లనిగోవు వెళ్ళుచున్నది. దానిని చూడుము అనుచోట ద్రవ్యమైన గంటలు విశేషణము. తెల్లని అనునది గుణ విశేషణము. వెళ్ళుచున్నది అన్నది కర్మ. విశేషణములు లేక విశిష్ట ప్రతీతి కలుగదు. కాన జ్ఞానము ద్రవ్యగుణ కర్మల నపేక్షించి కలుగునని భావము.

మూ. గుణకర్మసు గుణకర్మాభావాత్ గుణకర్మాపేక్షం నవిద్యతే. 8-1-8

సూ. గుణకర్మలందు గుణకర్మలు లేకపోవుటవలన వాని జ్ఞానములో గుణకర్మల యపేక్ష లేదు.

మూ. సమవాయినః శ్వైత్యాచ్ఛ్వైత్య బుద్ధేశ్చ శ్వేతే బుద్ధిః తే ఏవ కార్యకారణ భూతే. 8-1-9

సూ. సమవాయులగు శ్వేతత్వ శ్వైతత్వ బుద్ధులను బట్టి శ్వేత వస్తువునందు తద్వస్తుజ్ఞానము కలుగుచున్నది కాన ఇవి కార్య కారణము లైనవి.

శ్వేతశంఖము ఇత్యాదులలో శ్వేతత్వ సమవాయి యగు శ్వేతత్వ గుణములో శ్వేతత్వ విశేషణ జ్ఞానము కారణముగా చెప్పఁబడినది. కాన విశేషసంబంధ విశేషణ తత్ జ్ఞానములు విశిష్ట ప్రత్యక్షములో కారణములు.

మూ. ద్రవ్యేష్వనితరేతర కారణాః. 8-1-10

సూ. ద్రవ్య విషయక బుద్ధులు పరస్పర కారణములు కావు. ఒక ద్రవ్యములో నింకొక ద్రవ్యము కారణము కాదు.

ఘటజ్ఞానమును గూర్చి పటజ్ఞానము, పటజ్ఞానమును గూర్చి ఘట జ్ఞానము కారణములు కావని భావము.

మూ. కారణాయౌగపద్యాత్కారణ క్రమాచ్చ, ఘటపటాది బుద్ధీనాం క్రమో న హేతుఫల భావాత్. 8-1-11

సూ. ఇంద్రియార్థ సంనికర్షాది కారణము లొక్కమాటుగా కలుగక క్రమముగా కలుగుటవల్ల ఘటపటాది జ్ఞానములు క్రమముగా కలుగుచున్నవి కాన హేతుఫలములను బట్టి మాత్రము కాదు.

ఇది శ్రీ కణాద మహర్షిచే రచింపఁబడి,
చర్ల వెంకమాంబా నారాయణశాస్త్రుల
తనయుఁడగు గణపతిశాస్త్రిచే తెనిఁగింపఁబడిన
వైశేషిక మీమాంసా దర్శనమున
ఎనిమిదవ యధ్యాయమున
మొదటి యాహ్నికము.

---

## ఎనిమిదవ యధ్యాయమున రెండవ ఆహ్నికము

మూ. అయమేష త్వయాకృతం భోజయైనమితి బుద్ధ్యపేక్షం. 8_2_1

సూ. ఇది, అది, నీచే చేయబడినది. వీనిని భుజింపఁ జేయుము ఇత్యాదులు బుద్ధి నపేక్షించిన జ్ఞానములు.

దృష్టేషుభావా దదృష్టే ష్వభావాత్. 8_2_2

సూ. కనిపించు వస్తువులందు కలుగుటవల్లను కనిపించని వాని యందు కలుగకపోవుటవల్లను ఇది అది మొదలగు ప్రత్యక్ష జ్ఞానములు కలఁగును.

మూ. అర్థ ఇతి ద్రవ్యగుణకర్మను. 8_2_3

సూ. ద్రవ్య గుణ కర్మలందు అర్థ మనుపద ముపయోగింపబడును.

మూ. ద్రివ్యేషు పంచాత్మకత్వం. 8_2_4

సూ. ద్రవ్యములందు పంచభూతాత్మకత్వము కలదు.

మూ. భూయస్త్వాత్ గంధవత్వాచ్చ పృథివీ గంధజ్ఞానే ప్రకృతిః. 8_2_5

సూ. ఎక్కువగా నుండుటవలనను గంధము గలిగిన దగుటవలనను పృథివి గంధజ్ఞానములో ప్రకృతియగును.

ప్రకృతి=ఉపాదాన కారణము.

మూ. తథాఽవస్తేజో వాయుశ్చ రసరూపస్పర్శ జ్ఞానేఽ విశేషాత్. 8_2_6

సూ. అట్లే విశేషము లేకపోవుటవలనను రసరూపస్పర్శ జ్ఞానములో నీరు తేజస్సు వాయువులు వరుసగా ప్రకృతులు.

ఇది శ్రీ కణాది మహర్షిచే రచింపఁబడి చర్ల వెంకమాంబా
నారాయణ శాస్త్రిల తనయుఁ డగు
గణపతిశాస్త్రిచే అనువదింపఁ బడిన
వైశేషిక మీమాంసా దర్శనమున
ఎనిమిదవ యధ్యాయమున — రెండవ ఆహ్నికము.

---

# తొమ్మిదవ యధ్యాయములో మొదటి ఆహ్నికము

మూ. క్రియాగుణ వ్యపదేశాత్ ప్రాగసత్. 9-1-1

సూ. క్రియాగుణ వ్యవహారము లేకపోవుటవలన కార్యము ఉత్పత్తికి పూర్వము లేనిదె.

ఘటము తయారైన పిదప ఘటమున్నది, తీసికొనిరమ్ము, ఘటము నల్లనిది మొదలైన వ్యవహారములు కలుగుచున్నవి కాని అది తయారగుటకు ముందు ఆ వ్యవహారములు లేవు. కాన అది తయారగుటకు ముందు లేనిదె. ఇది యభావములో ఒకరకము. అభావము ప్రాగభావము ప్రధ్వంసాభావము, అన్యోన్యాభావము, అత్యంతాభావము అని నాలుగు రకములు. దీనిని ప్రాగభావమందురు. దీని ప్రతీతి ప్రత్యక్షానుమానముల వల్ల కలుగుచున్నది.

మూ. స దసత్. 9-1-2

సూ ఉన్నది నశించినపిదప లేనిదగును.

దీనిని ప్రధ్వంసాభావ మందురు.

మూ. అసతః క్రియాగుణ వ్యపదేశాభావా దర్థాంతరం. 9-1-3

సూ. లేనివానికి క్రియాగుణ వ్యవహారము లేనందువల్ల క్రియాగుణ వ్యవహారములు గల సత్పదార్థము వేరొక పదార్థము.

మూ స చ్చాసత్. 9-1-4

సూ. ఉన్నదికూడ లేనిదని వ్యవహరింపబడు చున్నది. అశ్వము గోవుకాదు, గోవు అశ్వముగాదు. ఘటము పటముగాలేదు. అశ్వము అన్యమగు గోవుకాదు. గోవు అన్యమగు అశ్వముకాదు. ఇట్లే మిగిలినవి. ఇది మూడవరకము. దీని అన్యోన్యాభావమందురు.

మూ. యచ్చాన్య దసద్ త స్తద్ సత్. 9-1-5

సూ. ఏది చెప్పబడినదాని కంటె భిన్నమైన యభావమో. అది అత్యంతాభావము.

ఆకాశ పుష్పపరిమళము, గొడ్డురాలి కొడుకు కుందేటికొమ్ము ఇవి యన్ని ఎప్పుడును ఉండవు. కాన అత్యంతా భావమందురు.

మూ. అసదితి భూత ప్రత్యక్షా భావాత్ భూతస్మృతేః విరోధి ప్రత్యక్షవత్. 9_1_6

సూ. వస్తువులు ప్రత్యక్షము కాకపోవుటవల్ల ఆవస్తు స్మృతివల్ల ధ్వంసకు విరోధులగు వస్తువులు ప్రత్యక్షమైనట్లు లేనిదని వ్యవహారము కలుగు చున్నది.

ఘటము లేనిది, ఘటమునశించినది అను వానిలో ఇప్పుడు ఘటము లేకున్నను ఇదివఱకటి ఘటము యొక్క స్మృతివలన ఘట ప్రత్యక్షము కలుగుచున్నది. ఇది ఇదివరలో చెప్పిన ప్రధ్వంసా భావము.

మూ. తథాఽభావే భావప్రత్యక్షత్వాచ్చ. 9_1_7

సూ. అట్లే ప్రాగభావమునందును ఊహాలో భావవస్తు ప్రత్యక్ష మగుటవలనను వ్యవహారము కలుగుచున్నది.

మూ. ఏతేనాఽఘటోఽగా రధర్మశ్చ వ్యాఖ్యాతః 9_1_8

సూ. దీనిచే అఘటము అగోవు అధర్మము మొదలగునవి వ్యాఖ్యానింపఁ బడినవి.

ఘటము పటముగాదు మొదలగు అన్యోన్యా భావ యాఃములు దీనివల్ల నయినవని భావము.

మూ. అభూతం నాస్తీ త్యనర్థాంతరం. 9_1_9

సూ. అభూతము లేదు అనునవి పర్యాయపదములు. జలమందు పృథవీత్వము లేదు పృథివియందు జలత్వము లేదు మొదలగు వ్యవహార ములలో ఇప్పుడు లేదు అను ప్రతీతినిబట్టి ఎప్పుడును లేదు అను వ్యవ హారము ప్రత్యక్ష మగుచున్నదని భావము.

మూ. నాస్తి ఘటో గేహ ఇతి ఘటస్య గేహ సంసర్గ ప్రతి షేధః. 9_1_10

సూ. ఇంటిలో ఘటములేదు అన్నపుడు యింకొక యింటిలో నున్న ఘటమునకు ఈ యింటిలో సంసర్గము నిషేధింపఁబడినది.

మూ. ఆత్మన్యాత్మ మనసోః సంయోగ విశేషాత్ ఆత్మ ప్రత్యక్షం. 9-1-11

సూ. ఆత్మయందు ఆత్మ మనస్సుల సంయోగవిశేష ముండుట వల్ల ఆత్మ ప్రత్యక్ష మగుచున్నది.

మూ. తథా ద్రవ్యాంతరేషు ప్రత్యక్షం. 9-1-12

సూ. అట్లే యితర ద్రవ్యములందు ఇతర ద్రవ్య ప్రత్యక్ష జ్ఞానము కలుగుచున్నది.

మూ. అసమాహితాంతః కరణా ఉపసంహృత సమాధయ స్తేషాంచ. 9-1-13

సూ. సమాధికి దూరులై ఉపసంహరించిన సమాధి గలవారికి ద్రవ్యాంతర ప్రత్యక్ష జ్ఞానము కలుగును.

మూ. తత్సమవాయాత్ కర్మగుణేషు. 9-1-14

సూ. మనస్సంయోగము గల ద్రవ్యములతో సమవాయమువలన ద్రవ్యాంతరములందు తత్తత్కర్మగుణ ప్రత్యక్ష జ్ఞానము కలుగును.

మూ. ఆత్మ సమవాయాత్ ఆత్మగుణేషు. 9-1-15

సూ. ఆత్మ సంయోగి సమవాయమువలన ఆత్మ గుణములందు యోగులకు ప్రత్యక్ష జ్ఞానము కలుగును.

ఇది శ్రీ కణాద మహర్షిచే రచింపఁబడి చర్ల వెంకమాంబా
నారాయణ శాస్త్రుల తనయుఁడగు
గణపతిశాస్త్రిచే అనువదింపఁ బడిన
వైశేషిక మీమాంసా దర్శనమున
తొమ్మిదవ యధ్యాయమున
మొదటి ఆహ్నికము.

## తొమ్మిదవ యధ్యాయమున రెండవ ఆహ్నికము

మూ. అస్యేదం కార్యం, కారణం, సంయోగి, విరోధి సమవాయి, చేతిలింగం. 9-2-1

సూ. దీని కిది కార్యము, దీని కిది కారణము, దీని కిది సంయోగి, దీనికిది విరోధి, దీని కిది సమవాయి అను వానికి వాని జ్ఞానము లింగము.

ధూమాదులు నిప్పు యొక్క కార్యములు. వర్షమునకు మేఘము కారణము. చర్మమునకు శరీరము సంయోగము గలది. వాయు మేఘ సంయోగము వర్షాభావమునకు విరోధి, గుణాదులు వస్త్రాదుల సమవాయి, వీని సంబంధము తత్త ద్విషయక జ్ఞానము లింగమని భావము.

మూ. అస్యేదం కార్య కారణసంబంధశ్చావయవా ద్భవతి. 9-2-2

సూ. దీనికిది కార్యము కారణము అని యన్నపుడు ఆ కార్య కారణ సంబంధము అవయవమును బట్టి కలుగు చున్నది.

కార్య కారణ సంబంధము పంచావయవ వాక్యమును బట్టి తెలియును. ప్రతిజ్ఞ హేతువు ఉదాహరణము అవయవి నిగమనము అనునవి అనుమాన ప్రమాణములోని పంచావయవ వాక్యములు. పర్వతము నిప్పు గలది అన్నది ప్రతిజ్ఞా వాక్యము. పొగ యుండుటవలన అన్నది హేతువు. ఎట్లన వంటయిల్లు, ఎక్కడెక్కడ పొగయున్నదో అక్కడక్కడ నిప్పుగలది అన్నది అవయవి. అట్లే యీ పర్వతము నిప్పుగలది అన్నదినిగమనము.

మూ. ఏతేన శాబ్దం వ్యాఖ్యాతం. 9-2-3

సూ. దీనిచే శబ్దజ్ఞానము వ్యాఖ్యానింప బడినది.

వ్యాప్తి పక్ష ధర్మతాజ్ఞానముచే జ్ఞానము కలిగినట్లే ఆప్తులను బట్టి ఆకాంక్షా సన్నిధ్యాదులను బట్టి శబ్ద సంబంధజ్ఞానము కలుగును.

౯ అ. ౨ ఆ.

మూ. హేతు రపదేశో లింగం ప్రమాణం కరణమిత్య 9-2-4
నర్థాంతరం.

సూ. హేతువు అపదేశము లింగము ప్రమాణము కరణము అను
నవి పర్యాయపదములు.

9-2-5
మూ. అస్యేదమితి బుద్ధ్యపేక్షితత్వాత్.

సూ. దీనికి ఇది కార్యము మొదలగునవి బుద్ధి నపేక్షించి
యుండుటవలన ఉపమానాదులు ఆ లింగమువలన కలిగినవే యగును.

ఆది పదముచే అర్థాపత్తి సంభవము అభావము గ్రహింపఁ
బడినవి. గవయ మృగము గోసదృశమైనది అనుచోట శబ్దము ద్వారా
అనుమానమె కలుగుచున్నది. అర్థాపత్తి:—దేవదత్తుఁడు బలిసి యున్నాడు.
పగలు భుజింపఁడు. రాత్రి భుజింపనిదే బలియుట కుదురదు కాన రాత్రి
భుజించుచున్నాడను అర్థము ఆసన్న మగుచున్నది. సంభవము
నూటిలో పది పదిలో అయిదు ఇట్లు పెద్దదానిలో చిన్న దుండుట,
ఉపమాదులు లింగమువలననే సిద్ధించినవి. వేఱుకావని భావము.

మూ. ఆత్మమనసోస్సంయోగవిశేషాత్సంస్కారాచ్చ స్మృతిః
9-2-6

సూ. ఆత్మ మనస్సుల సంయోగ విశేషమువల్లను సంస్కారము
వల్లను స్మృతి కలుగును.

9-2-7
మూ. తథా స్వప్నః.

సూ. అట్లే స్వప్నము పూర్వానుభూత సంస్కారము వల్ల
గలుగును.

9-2-8
మూ. స్వప్నాంతికం.

సూ. స్వప్నములోని విషయము సంస్కారము వల్లనె కలుగును.

9-2-9
మూ. ధర్మాచ్చ.

సూ. ధర్మమువల్లను స్వప్నమున ననేక విషయజ్ఞాన మగును.

మూ. ఇంద్రియ దోషాత్ సంస్కార దోషాచ్చ అవిద్యా. 9-2-10

సూ. ఇంద్రియముల దోషమువల్లను సంస్కార దోషము వల్లను అవిద్య కలుగును.

మూ. తద్దుష్ట జ్ఞానం. 9-2-11

సూ. అది దోషసహిత జ్ఞానము.

మూ. అదుష్టం విద్యా. 9-2-12

సూ. దోషము లేనిది విద్య.

మూ. ఆర్షం సిద్ధదర్శనంచ ధర్మేభ్యః. 9-2-13

సూ. ధర్మములవల్ల ఆర్షజ్ఞానము సిద్ధ దర్శనమును గలుగును.

ఆర్షజ్ఞానము — ఋషుల యతీతానాగతాది జ్ఞానము సిద్ధదర్శనము=అణిమాది సిద్ధులకు సంబంధించిన జ్ఞానము.

ఇది శ్రీ కణాది మహర్షిచే రచింపఁబడి
చర్ల వెంకమాంబా నారాయణశాస్త్రిల
తనయుఁడగు గణపతిశాస్త్రిచే తెనిఁగింపఁబడిన
వైశేషిక మీమాంసా దర్శనమున
తొమ్మిదవ అధ్యాయమున
రెండవ ఆహ్నికము.

---

# పదవ యధ్యాయమున మొదటి అహ్నికము.

మూ. ఇష్టానిష్ట కారణ విశేషాత్ విరోధాచ్చ మిథః సుఖదుః ఖయో రర్థాంతరభావః. 10-1-1

సూ. ఇష్టానిష్టములకు కారణవిశేష ముండుట వలనను సుఖదుఃఖములు అవి యొకదాని కొకటి విరోధులగుటవల్లను పరస్పరము అవి భిన్నములు.

సుఖము=ఇష్టకారణజన్యము. దుఃఖము=అనిష్టకారణ జన్యము. ఇవి ఒకచోట నుండవు.

మూ. సంశయ నిర్ణయాంతరా భావశ్చ జ్ఞానాంతరత్వే హేతుః. 10-1-2

సూ. సుఖదుఃఖములలో సంశయ జ్ఞానముగాని నిశ్చయ జ్ఞానముగాని లేకపోవుటవలన సుఖదుఃఖములు జ్ఞానరూపములు కావు.

అందుచే జ్ఞానరూపములు కావు కాన జ్ఞానములో అంతర్భవింపవు.

మూ. తయో ర్నిష్పత్తిః ప్రత్యక్ష లైంగికాభ్యాం. 10-1-3

సూ. ప్రత్యక్షానుమానములవలన సంశయ నిశ్చయ జ్ఞానములు పుట్టుచున్నవి.

సుఖ దఃఖములు విషయములను బట్టియు మనోరథములను బట్టియు అభిమానమును బట్టియు అభ్యాసమును బట్టియు అవి సిద్ధింపక పోవుటను బట్టియు కలుగుచున్నవె కాని ప్రత్యక్షానుమానముల వలన గలుగవు.

సంశయ నిశ్చయములకును సుఖదుఃఖములకును గల భేద మిది అని తెలియవలయు.

మూ. అభూ దిత్యపి. 10-1-4

సూ. అనుమానములో ఉండెను, ఉండును అనునట్టి అతీతాది ప్రకారకజ్ఞానము కలుగును.

పర్వతమందు నిప్పు ఉండెను. ముందుండును అను జ్ఞానము అనుమానమువలనఁ గలుగును. ఇట్లు సుఖదుఃఖములు ఉండవని భావము.

మూ. సతిచకార్యాదర్శనాత్. 10_1_5

సూ. ఇంద్రియార్థ సంనికర్ష యున్నను వాప్త్యాది జ్ఞాన మున్నను కార్యమగు సుఖదుఃఖములు కనిపింపకపోవుటవల్ల అవి ప్రత్యక్షాను మానములవల్ల గల్గునవి కావు

మూ. ఏకార్థ సమవాయి కారణాంతరేషు దృష్టత్వాత్. 10_1_6

సూ. సుఖదుఃఖములు ఏకార్థ సమవాయి కారణాంతరములందుఁ జూడఁబడక పోవుటవలన అవి జ్ఞానరూపములు కావు.

ధర్మము సుఖేచ్ఛ సుఖసంపాదన యత్నము స్రక్చందనాది జ్ఞానము. ఇవి సఖమును గూర్చి ఏకార్థ సమవేతములై (ఒకే యర్థమున సమవేతములై =అసాధారణ కారణములై) యున్నవి. అధర్మము అనిష్ట కంటకాది జ్ఞానము ఇవి దుఃఖమును గూర్చి అసాధారణ కారణ ములు. వీనిలో సుఖదుఃఖములు చూడబడుటవలనను జ్ఞానము అసాధా రణ కారణమును అపేక్షింపక పోవుటవలనను ఇవి జ్ఞానరూపములు కావని భావము.

మూ. ఏకదేశ ఇత్యస్మిన్ శిరఃపృష్ఠ ముదరం మర్మాణి తద్విశేష స్తద్విశేషేభ్యః. 10_1_7

సూ. ఏకదేశమందు ఆసుఖదుఃఖము లున్నవన్నచో ఒకటే యయిన శరీరమందున్న తల వీపు పొట్ట మర్మములు మొదలగు వానికి తత్కారణ విశేషములనుబట్టి భేదము కలుగునట్లు వీనికి భేదముకలుగును.

తల వీపు మొదలైనవి లోని విశేషములను బట్టి పరస్పరము భిన్నములైనట్లు విషయాదులందున్న సుఖదుఃఖములు విషయాది జ్ఞాన ములకంటె భిన్నములని భావము.

ఇది పదవ అధ్యాయమున మొదటి ఆహ్నికము.

---

## పదవ అధ్యాయములో రెండవ ఆహ్నికము

మూ. కారణమితి ద్రవ్యే కార్య సమవాయాత్. 10-2-1

సూ. కార్యములందు సమవాయ సంబంధముతో నుండుటవలన కారణ మనునది ద్రవ్యమునం దుండును. వస్త్రమునకు దారములు సమవాయి కారణము. ఈసమవాయి కారణములైన దారములు ద్రవ్యములని భావము.

మూ. సంయోగాద్వా. 10-2-2

సూ. సంయోగమువల్లఁగాని ద్రవ్యములు నిమిత్త కారణములు గూడ నగును.

వస్త్రముతో నూలుకండెలు నాడులు సంయోగమంది యుండుట వలన ద్రవ్యములైన కండెలు మొదలగునవి నిమిత్తకారణము లగునని భావము.

మూ. కారణే సమవాయాత్ కర్మాణి. 10-2-3

సూ. సంయోగాది సమవాయ కారణమందు సమవాయ కారణముగా నుండుటవలన కర్మలు అసమవాయి కారణములగును.

మూ. తథా రూపే కారణై కార్థ సమవాయాచ్చ. 10-2-

సూ. అట్లే అవయవములందున్న రూపాదిగుణములందు అవయవి యందున్న రూపాదులకు సమవాయికారణమైన యవయవిలో గూడ ఏకార్థ సమవాయి కారణముగా నుండుటవలన అసమవాం కారణత్వము కలుగును.

మూ. కారణ సమవాయాత్ సంయోగః పటస్య. 10-2.

సూ. సమవాయి కారణమందు సమవాయి కారణము నుండుటవలన సంయోగము పటాదులందు అసమవాయి కార మగుచున్నది.

మూ. కార్యకారణ సమవాయాచ్చ. 10-2-6

సూ. కారణమునందున్న కారణమైన దానియందు సమవాయి కారణముగా నుండుటవలన సంయోగము అసమవాయి కారణమగును.

కారణములైన తూల పిండములవలన వృద్ధిపొందిన తూల పిండ మందున్న మహత్త్వమునందు తూలపిండ ద్వయ సంయోగము ప్రచ యాభిధానమైన కారణము సమవాయముగా నుండుటవలన అందు సంయోగము సమవాయముగా నుండును.

మూ. సంయుక్త సమవాయా దగ్నే ర్వైశేషికం. 10-2-7

సూ. అగ్ని యొక్క విశేషగుణము సంయుక్త సమవాయ మగుటవలనఁ బాకజములందు నిమిత్తకారణ మగును.

మూ. దృష్టానాం, దృష్ట ప్రయోజనానాం దృష్టా భావే ప్రయోగోఽభ్యుదయాయ. 10-2-8

సూ. శాస్త్ర దృష్టములైన కర్మలకును శాస్త్ర దృష్టములైన ప్రయోజనములకును దృష్టఫలము లేనపుడు తత్కార్యాచరణము అభ్యు దయముకొఱకగును.

శాస్త్రములందు దృష్టములైన యాగ దాన స్నానాది కర్మల కును 'స్వర్గకామో యజేత్' స్వర్గము కోరువాడు యజ్ఞము చేయ వలెను. "అగ్నిహోత్రం జుహుయాత్ స్వర్గకామః" స్వర్గముకోరువాడు అగ్నిహోత్రమునందు హోమము చేయవలయును. దేవతలను ఆహ్వా నింపవలెను. ఇత్యాది ప్రయోజనములకును ప్రత్యక్షఫలము కనిపింప నపుడు తదాచరణమువలన అపూర్వమను సంస్కారము (చేసిన కర్మలు ఫలితము కలుగువరకు అపూర్వమగు సంస్కారము కలుగుననియు అది స్వర్గాది ఫలములకు పరలోకమునకు కారణమయి యుండునని పెద్ద లందురు) కలిగి దానివలన అభ్యుదయము కలుగునని భావము.

ఆ కర్మాచరణమువలన అదృష్టమైన పుణ్యము అపూర్వ రూపముగా నుండి యుత్తరోత్తర జన్మలందు ఫలముకొఱకగునని భావము.

మూ. తద్వచనా దామ్నాయస్య ప్రామాణ్యం. 10-2-9

సూ. అతని (ఈశ్వరుని) వచన మగుటవల్ల వేదము ప్రమాణము.

ఇది శ్రీ కణాది మహర్షిచే రచింపఁబడి చర్ల వెంకమాంబా
నారాయణ శాస్త్రిల తనయుఁ డగు
గణపతిశాస్త్రిచే అనువదింపఁ బడిన
వైశేషిక మీమాంసా దర్శనమున
పదవ యధ్యాయమున
రెండవ ఆహ్నికము.

సర్వము సమాప్తము.